1. భక్షించుటయేస్వభావముగా గలరాక్షసపిశాచాదులు మనుష్యులనుచంపుటకు అమావాస్యనాటి రాత్రి తిరుగుచుందురు.కావున రాక్షసులనువధించు తురీయఅగ్ని మాకు అభయముఇచ్చును గాక. రాక్షసపిశాచాదులనువధించును గాక.

వ్యాఖ్య- "అమా సహ వసతఃఅస్యాం తిథౌ సూర్య చంద్రమసౌఇతి అమావాస్యా " - సూర్యచంద్రులు ఒకే రాశియందు ఉండు రాత్రిఅమావాస్య అగును. అమావాస్యమాసాంతపు. తిథి

వెన్నెలఏ మాత్రము ఉండనట్టిరాత్రి.

2. సీసమునాకు సంబంధించినదిఅనుచున్నాడు వరుణుడు.అగ్ని సీసమును కాపాడుచున్నాడు.ఇంద్రుడు సీసమునునాకు ప్రసాదించినాడు.సాధకులారా! సీసము రాక్షససంహారమగు చున్నది.

3 ఈసీసము రాక్షస పిశాచాదులకదలికను నిర్బంధించును.అడ్డుకొనుటయేకాదు - వారిని తొలగించును.కావున ఈ సీసముతో పిశాచాదులవలన కలుగు బాధలనుతొలగించుచున్నాను.

4. నీవుమా గోవులను హింసించుట,మా అశ్వములను హింసించుట,మా ప్రజను హింసించుటవలన మాకు శత్రువవుఅయినావు. అట్టి నిన్నుమా సంతానమునుహింసించ కుండుటకుసీసముతో కొట్టుచున్నాము.

## నాలుగవఅనువాకము

## మొదటిసూక్తము - 17

ంనియోగము:-

కత్తిమున్నగు వానితో తెగిరక్త స్రావము జరుగుచున్నపుడు- స్త్రీకి రజస్సు అధికముగస్రంంచునపుడు.

5గణపులకర్రను రక్తస్రావముజరుగుచోట అభిమంత్రించవలెను.దారిదుమ్ము, తడిఇసుక చల్లవలెను.ఎండిన బురద కట్టవలెను.

1. స్త్రీయొక్క రక్తస్థానమునుండి వ్యాధి కారణముగరక్తము నిరంతరముస్రంంచుచున్నది.మేము చేసినచికిత్స వలనఆ వ్యాధి యొక్క బీజమునష్టపడును. గాక సోదరులులేని యువతితండ్రి ఇంటనేఉన్నట్లు రక్తముతన స్థానముననిలుచును గాక.

వ్యాఖ్య:-తోబుట్టువులగుఅన్నదమ్ములులేని ఆడపిల్లలుపుట్టింటనే ఉండిపుత్రవతులైపితరులకు పిండ ప్రదానముచేయుదురని యాస్కునినిరుక్తము. అతడు"దాక్షిణాజీ" అన్నాడు.దక్షిణ దేశపు స్త్రీఅని అర్థము. ఇది ఇల్లరికము.నేడు సోదరులులేని ఆడ వారికి పితృపిండప్రదాన అర్హత లేకున్నది.

2. దేహపుదిగువ భాగపు ధమనులారా!రక్తస్రావము కట్టించండి.పై భాగపు ధమనులారా!రక్తస్రావము కట్టించండి.చిన్న ధమనులు,పెద్ద ధమనులుసహితము రక్తస్రావమునుఅరికట్టును గాక.

3. హృదయమందలి నూరు నాడులు వేలశాఖానాడులందలి మధ్యమ నాడి వ్యాధి కారణముగ రక్తము స్రంపచేయు చుండెను. ఇప్పుడు మంత్ర ప్రభావమున రక్తస్రావమును నిలిపి స్థిరపడును గాక. తదుపరి రక్తస్రావము చేయునట్టి ిగిలిన నాడుల వలె ఈ నాడులు ఆనందించును గాక.

4. నాడులారా! రజోనాడి, అశ్మరీనాడి, ధనుర్నాడి, బృహతీనాడి చుట్టుముట్టినం. కావున రక్తస్రావము ఆపండి. వ్యాధిగ్రస్తునికి సుఖము కలిగించండి.

## రెండవ సూక్తము - 18

ినియోగము:-
సాముద్రిక దుర్లక్షణములు గల స్త్రీ యొక్క దోషనివారణార్థము ముఖము కడిగించుట, స్నానము చేయించవలెను. లేదా ఫలీకరణ తుషావతక్షణ హోమము చేయించవలెను.

1. తిలకపు స్థానమున నిలిచిన అసౌభాగ్య చిహ్నమును ఈ శరీరము నుండి పూర్తిగా తొలగించుచున్నాము. శత్రువు వలె శరీరమున నిలిచిన దుర్లక్షణమును తొలగించుచున్నాము. తదుపరి శుభచిహ్నములు మా సంతానమునకు, అశుభ చిహ్నములు శత్రువులకు కలుగును గాక.

2. సంత పాదముల అలక్ష్మిని తొలగించును గాక. వరుణుడు, ిత్రుడు, ఆర్యమ కాళ్లు, చేతులందలి అలక్ష్మి చిహ్నములను తొలగింతురు గాక. అందరకు సలహాలిచ్చు అనుమతిదేం మా స్తుతులు ిని అభయ ప్రదానము చేయును గాక. అభిలషిత ఫలములను ఇచ్చుచు దేహమునందలి సకల దుర్లక్షణములను తొలగించును గాక.

3. నీ దేహమందు, కేశములందు, నేత్రములందు ఉన్న ఘోర దుర్లక్షణములను ప్రయోగ కుశలురమగు మేము మంత్రములచే తొలగించుచున్నాము. సంతా దేవత నీకు శుభములు కలిగించును గాక.

4. సారం మృగము వంటి పాదములు, ఎద్దు వంటి దంతములు, గోవు వంటి, నడక, బుసకొట్టు మాట స్త్రీకి గల దుర్లక్షణములు. ఆ దుర్లక్షణములను నాశనము చేయుచున్నాము.

వ్యాఖ్య - ఈ సూక్తము ింతంతు ివాహమునకు సంబంధించినట్లు తోచుచున్నది. ింతంతు లక్షణములు తొలగించి సౌభాగ్యవతిని చేయుట వలె ఉన్నది. ఇది నా అభిప్రాయము మాత్రము. మరింత ఆలోచించవలసి ఉన్నది.

## మూడవ సూక్తము - 19

ినియోగము :-
సాంగ్రాికాది కర్మలందు. బ్రాహ్మణుడు ఆయుధము ధరించుట - దేవతా ప్రతిమలను ఆడించుట- నవ్వుటల యందు.

1. అస్త్రశస్త్రములు ధరించి యుద్ధమందు మా ిదకు దాడికి వచ్చువారు మమ్ము చేరుకొనకుందురు గాక. ఎదురుగా వచ్చు భటులు కూడ మమ్ము చేరుకుందురు గాక. ఇంద్రదేవా! శత్రువుల శరపరంపర మాకు దూరముగా పడునట్లు చేయుము.

2. శత్రువులు ిడిచిన బాణములు, ిడువనున్న శరములు మమ్ము ిడిచి అన్య స్థానముల పడును గాక. మా చేతనున్న దైి, మానుషాస్త్రములు శత్రువులను వధించును గాక.

3. శత్రువులందు మా వారలున్నారు. మాతో మాట్లాడని వారున్నారు. మాతో సములగు శత్రువులున్నారు. మమ్ము బాధించు, క్షోభ పెట్టు అట్టి శత్రువుల ప్రాణములను రుద్రదేవుడు అంత్యకాలము వరకు ఏడిపించును గాక.

4. సజాతి శత్రువులు, అన్యజాతి శత్రువులు, వృధాగా కోపించి శపించు శత్రువులందరను సమస్త దేవతలు హింసింతురు గాక. మంత్ర వాక్కులు మాకు కవచములు అగును గాక.

## నాలుగవ సూక్తము - 20

ినియోగము :-
1. మూడవ సూక్తము వలె. 2. మొదటి మంత్రము దర్శపూర్ణ మాసములందు శృత హిర్నిరీక్షణమందు.
1. చంద్రదేవా! నా శత్రువు స్థానభ్రష్టుడై ఎన్నటికి తనభార్యను చేరకుండును గాక. నలుబది తొిమ్మది మంది వాయు దేవతలారా! నా యజ్ఞము వలన మాకు సుఖములు కలిగించండి. ఎదురుగా వచ్చు శత్రువు నన్ను తాకకుండును గాక. అపకీర్తి నన్ను చేరకుండును గాక. నేను ద్వేషించు శత్రుసేన నన్ను తాకకుందును గాక. ఓటిి కలిగించు నట్టియు ఫలితములకు ఆటంకము కలిగించు పాపములు నన్ను ముట్టకుండును గాక.

2. ఈ యుద్ధమున శత్రుసేన ప్రయోగించు శస్త్ర సమూహము మా ిదకు వచ్చుచున్నది. ిత్రావరుణులారా! ఆ శస్త్రములను మా ిదకు రానీయకండి. మళ్లించండి. అి మమ్ము తాకకుండ చేయండి.

3. దూరముగ నిలిచిన శత్రువు మారణాయుధము, దగ్గర నిలిచిన శత్రువు మారణాయుధము నా ందకు వచ్చుచున్నది. వరుణదేవా! వానిని దారి మళ్లించండి. మాకు తాకకుండ చేయండి.
శత్రువునకు అందని సుఖములను నాకు కలిగించండి. మంత్ర సహితముగ ప్రయోగించిన అస్త్రశస్త్రములను మానుంచి దూరము చేయండి.

4. ఇంద్రా! నీవు నియంతవు. మహానుడవు. శత్రు తిరస్క ర్తవు. అపరాజితుడవు. ఇన్ని మహిమలవాడవు ుత్రుడుగా గలవాడు శత్రువు చేత వధించబడడు. అతనికి ఓటు కలుగదు.
అటువంటి ఇంద్రుని అనుగ్రహమున మేము సహితము శత్రువులను ఓడించగలము.

## ఐదవసూక్తము - 21

ినియోగము :-
1. సాంగ్రాుకాదులందు ప్రయోగము.

2. గ్రామ గమనాదులందు క్షేమము కోరువాడు ఈ సూక్తము చదువుచు కుడికాలు ఎత్తి, దుమ్ము, గుడ్డిని తొలగించి ఇంద్రోపస్థానము చేయవలెను.

3. పిశాచాదుల ినాశనమునకు, ఉద్వేగ నివారణకు ఉపయుక్తము.

4. వేదీ కరణాదులందు ఈ సూక్తమును జపించ వలెను.

1. ఇంద్రుడు అంనాశ్యుడు. శుభప్రదుడు. సకల ప్రజాపాలకుడు వృత్రహంత. శత్రుసంహారి. సకల ప్రాణులను అధీనమందు ఉంచుకొనువాడు. సోమపాయి.
అట్టి ఇంద్రుడు అభయము ఇచ్చుచు యుద్ధమున అగ్రసరుడు అగును గాక.

2. పరమ ఐశ్వర్యవంత ఇంద్రా! యుద్ధములందు మా పగతురను నష్టపరచుము. శత్రుసేనలను ఛిన్నాభిన్నము చేయుము. మా ధనక్షేత్రాదులను హరించుచు మా శత్రువును అంధకరమున పడవేయుము.

3. వృత్రహంత ఇంద్రా! రాక్షసులను వధించుము. యుద్ధములను దూరము చేయుము. వృత్రసమ శత్రువుల తలలు పగుల కొట్టుము. మా ధనాదులు హరించ దలచిన శత్రువు కోపమును శాంతింప చేయుము.

4. ధనశాలి ఇంద్రా! ద్వేషించు శత్రువు యొక్క క్రూర మనమున అణచి వేయుము. మమ్ము వధించదలచు వాని ఆయుధమును నష్టపరచుము. మాకు మహ సుఖసంపదలను ప్రసాదించుము. అస్త్ర శస్త్రములను మాకు దూరముగా ఉంచుము.

# అయుదవ అనువాకము

## మొదటి సూక్తము - 22

◌నియోగము :- హృద్రోగ, కా◌ులా రోగ నివారణము.
1. ఎరువు వృషభము రోమములను నీటిలో కలిపి త్రాగించవలెను.

2. రక్త గో చర్మచ్ఛిద్రమణిని ఆవు పాలలో వేసి సంపాతన అభిమంత్రణములు చేసి పాలు త్రాగించి, మణిని కట్టవలెను.

3. రోహిణి హరిద్ర ఓదనము తినిపించవలెను. ◌ుగిలిన దానిని కాళ్ల వరకు రాసి మంచములో కూర్చుండ పెట్టవలెను. శుక కాష్ఠ, శుకమ గోపీతనకు పక్షులు కుడి కాళ్లకు హరి సూత్రము కట్టి మంచము క్రింద ◌డువవలెను.

1. వ్యాధిగ్రస్తా! నీ హృదయ బాధయు, కా◌ుల వలన కలిగిన రంగును సూర్యుని చేరును గాక. హృదయ బాధయు, శరీరపు హరిత వర్ణమును దేహము నుండి వెడలి హరిద్వర్ణ సూర్యునిలో కలసి పోవును గాక. లోహిత వర్ణ గోవు యొక్క లోహిత వర్ణముచే నిన్ను ఆచ్ఛాదించుచున్నాను. నీ శరీరమును మంచి వన్నెగల దానిగ చేయుచున్నాను.

2. వ్యాధిగ్రస్తా! నిన్ను గోసంబంధి రక్త వర్ణముచే ఆచ్ఛాదించుచున్నాను. అందువలన నీవు రోగ రహితుడవు, పాపరహితుడవు అగుము. పాపక్షయమైనంత వ్యాధి వలన కలిగిన పచ్చరంగు తొలగి పోవున గాక దీర్ఘాయువు కలుగును గాక.

3. దేవతల అరుణవర్ణ గోవు మానవుల అరుణ వర్ణ గోవునుండి అరుణరూపమును, పరిపూర్ణ యవ్వనము తీసి నీ యందు ప్రవేశపెట్టుచున్నాము.

4. రోగీ! నీకు వ్యాధి వలన కలిగిన హరిద్వర్ణమును శుకములకు, శుక కాష్ఠములకు, గోపీతనక పక్షులందు ప్రవేశపెట్టుచున్నాము.

## *రెండవ సూక్తము - 23*

◌నియోగము :- శ్వేత కుష్ఠు నివారణకు.
1. బృంగరాజము, పసుపు, నీలి మొక్కలను నూరి, ఎండిన ఆవు పేడతో కలిపి గాయపు చోట రక్తము కనిపించునంత వరకు రుద్ది రాయవలెను.

2. పలిత కేశ నివారణకు తెల్లని వెంట్రుకలను కత్తిరించి పై లేపమును రాయవలెను. 3. ఘృత హోమమును మారుత కర్మలను వృష్టి కర్మమును అనుసరించి చేయవలెను.

1. రాత్రిళ్లు పుట్టు హరిద్ర, భృంగ, ఇంద్రా వరుణి ఓషధులారా! ◌రు కుష్ఠురోగపు అవయవమును, తెల్లని వెంట్రుకలను, పుండ్లను మాన్పి దానికి ◌ వంటి రంగు కలిగించండి.

2. ఈ మంత్ర ప్రయోగమున ఎముకల ీద, చర్మము ీద, ఎముకలలోని, మాంసము నందలి కుష్ఠును నాశము చేయుచున్నాను. శత్రువుల చేత కల్పించబడిన కృత్య వలన ఏర్పడిన తెలుపును సహితము నాశనము చేయుచున్నాను.

## మూడవ సూక్తము - 24

ినియోగము - పూర్వ సూక్తము వలెనే.
(నీల ఓషధి ప్రభావము చెప్పుచున్నాడు.)

1. నీల ఓషధీ! తొలుత నీవు సుపర్ణుడగు గరుడునితో యుద్ధము చేసి నిన్ను గెలిచినది. గెలిచి నీకు ఓషధి రూపము కలిగించినది.

2. ఆసురి తొలుత భేషజము చేసినది. అది కుష్ఠునందలి పుండును నాశనము చేయునది అయినది. దీనిని ప్రయోగించుట వలన పుండు మానినది. అచట ఏర్పడిన మచ్చపోయి మామూలు చర్మము ఏర్పడినది.

3. ఓషధీ! నీ తల్లి చక్కనిది. తండ్రి చక్కనివాడు. నీవు చక్కదనము తెగలదానవు. ఈ వ్యాధిగ్రస్తుని చక్కని రూపము వానిని చేయుము.

4. ఓషధీ! నీవు నేల నుండి ఆిర్భింంచిన దానవు. నల్లని దానవు. తెలుపును పోగోట్టు దానవు. పుండును మాన్పుము. మచ్చ లేకుండా చేయుము. ముందటి రూపము కల్పించుము.

## నాలుగవ సూక్తము - 25

ినియోగము :-
1. నిత్యజ్వరము, చలిజ్వరము, సంతతిజ్వరము వేళ తప్పక వచ్చు జ్వరములకు ఈ సూక్తమును జపించవలెను.

2. గొడ్డలిని నిప్పులో కాల్చి వేయవలెను. ఆ నీటితో రోగికి స్నానము చేయుంచవలెను.

1. అగ్ని దేవుడు కాలిన గొడ్డలితో నీళ్లలో ప్రవేశించినాడు. బ్రతుకు దుర్భరము చేయు జ్వరమా! ఆ నీరు దేహమును ిడుము. అగ్నియందు హిని హోమము చేయు ిద్వాంసులు నీ జన్మము అగ్ని యందు కలిగినదని వర్ణించుచున్నారు.
(అగ్ని నుంచి వచ్చినావు. అగ్నిలో ప్రవేశింపుమని.)

2. దుఃఖకారక జ్వరమా! నీ గుణము ఉష్ణము. నీవు దేహ తపనుడవు. నీ పుట్టుక కట్టెల మంటలో జరిగినది. నీవు అగ్నిని తెలిసిన వాడవు. వేడి నీళ్లు పడిన మా దేహమును ిడువుము. అగ్నితోనే వెడలి పొమ్ము.

3. జ్వరమా! నీవు బయటి తాపమవు. లోపలి తాపమవు. పాపులను శిక్షించు వరుణుని పుత్రుడవు.
నీవు దేహమునకు పసుపు రంగు కల్పింతువు. అందుకే నీ పేరు "రూఢు" అయినది. నీవు అగ్నిని తెలిసిన వాడవు. వేడినీళ్లు పడిన దేహమును ండువుము. అగ్నితోనే వెడలి పొమ్ము.

4. చలితో వచ్చు జ్వరమునకు నమస్కారము. చలి తగ్గి వచ్చు జ్వరమునకు నమస్కారము. - రోజు ండిచి రోజు వచ్చు జ్వరమునకు నమస్కారము రెండు రోజులకు, మూడు రోజులకు, నాలుగు రోజులకు, వచ్చు జ్వరమునకు నమస్కరించుచున్నాను.

## ఐదవ సూక్తము - 26

ంనియోగము :-

1. ఖడ్గాది సంపూర్ణ శస్త్ర నివారణకు హోమమునందు.

2. దాడి చేయుటకు వచ్చు శత్రువును చూచి జపించుట.

3. దుశ్శకునము, కాకుల మైథునము, అద్భుత దర్శనములందు జపించుట.

4. ంజయ స్వస్త్యయన కర్మమున ఘృతాహుతి ఇచ్చి ఖడ్గ శస్త్రాదులను సాంపాతిత, అభిమంత్రణము చేయవలెను.

5. ంజయము కోరువాడు ఈ సూక్తము జపించి, ముఖము తుడుచుకొని రాత్రిపూట పడుకొనవలెను. ఉదయము లేచినపుడు దీనిని జపించి మూడు అడుగులు వేసి లేవవలెను.

1. దేవతలారా! ంు అనుగ్రహమున దూరము నుండి శత్రువు మా ంుదకు ప్రయోగించు ఆయుధము మాకు తగులక దూరమున పడిపోవును గాక.

శత్రువులారా! ంురు వేయు రాళ్లు మున్నగునం మాకు దూరమున పడు గాక.

2. ఆకసమందు దర్శన ంచ్చు సూర్యుడు మాకు ంత్రుడు అగును గాక. ఇంద్రుడు, భగుడు సంత, చిత్రరాధుడు మాకు ంత్రులు అగుదురు గాక.

3. సూర్యకిరణము జలములను పీల్చగా అకాల వర్షము కలిగించక మేఘ మండలమున నిలుపు పర్జన్యుని, సప్త మారుతముల తేజస్సు సూర్య సమానమగును. ంురందరు మాకు బహు సుఖములను ంశాల గృహములను ప్రసాదించండి.

4. దేవతలారా! శత్రువుల ఆయుధములు మా ంుద పడనీయకండి. మాకు మా సంతానమునకు సుఖములు కలిగించండి.

## ఆరవ సూక్తము - 27

ినియోగము :-

1. అయిదవ సూక్తము వలెనే.

2. మార్గమందు శుభమునకు నాలుగవ మంత్రముచే పాదములకు అభిమంత్రించి ఆయుధము అందించవలెను.

1. మనకు కనిపించు సర్పములందు ఇరువది యొక్క జాతులు ఉన్ని. ఆ సర్పములు దేవతాసములు. అి భూలోకమునకు ఆవల నాగలోకమున ఉండును. వానికి మాి వలె చుట్టుకున్న కుబుసములుండును. ఇతరులకు హాని తలపెట్టు వారి, యుద్ధమున నిలిచిన శత్రువులను కుబుసములతో మూసి వేయుదుము.

2. పినాకము శివుని ిల్లు. శత్రువు అట్టి ఆయుధములు ధరించి ఉన్నారు. పరసేనను గడగడలాడించుచున్నారు. అట్టి శత్రుసేన భయపడి నలువైపులకు పారిపోవలెను. అట్టి శత్రుసేన మరల కూడినను వారికి మతి భ్రిించును గాక. ధన ిహీనులు అగుదురు గాక.

3. మహాసేన మమ్ము గెలువకుండును గాక. స్వల్పసేన మమ్ము చూడలేకుండును గాక. పరాజితులై ధనహీనయైన సేన - గడకు పాకిన తీగవలె - నిస్తేజము అగును గాక. రాజ్యభ్రష్టయై నికృష్ట మగును గాక.

4. నడక సాగించు పాదములారా! నడవండి. వడివడిగా నడవండి. ఉత్సాహముగా నడవండి. గలితములు నిచ్చు గృహముల వరకు నడవండి. ఎవరును గెలువలేని "ప్రథమ" ఎవరును ఓడించలేని ఇంద్రాణి మమ్ము రక్షించుచు ముందు నడతురు గాక.

## ఏడవ సూక్తము - 28

ినియోగము :- ఉద్విగ్నుని ఉద్విగ్న నివృత్తికి శుక్ల ిరిణేషికాకృత మణిని కట్టవలెను. రెండు ఉల్ముకములను రుద్దవలెను.

1. అగ్ని రోగనాశకుడు. హింసక రాక్షస సంహారకుడు. స్వర్గనివాసి. నోటి దురుసుదనము, హింసాతత్త్వము గలవారిని, ఆతురవ గల వారిని, రంధ్రాన్వేషులను, బాధలు కలిగించు వారిని, రాక్షసులను అగ్ని భస్మము చేయుచు ఉద్విగ్నుని వద్దకు వచ్చుచున్నాడు.

2. అగ్నీ! యాతనలు కలిగించువారిని దహించుము. రంధ్రాన్వేషులను భస్మము చేయుము. నల్లని పొగగల అగ్నీ! ప్రాణులకు ప్రతికూలముగ నడచు వారిని నిర్మూలించుము.

3. ఒకతి శపించునది. ఒకతి పాపమే మూలముగా గలిగి పాపములను ఆచరించునది. ఒకతి పుట్టిన బిడ్డ రక్త రసమును పీల్చునది. ిరిలో ఒకరై తన సంతానమును, మా శత్రువుల సంతానమును ిింగును గాక.

వ్యాఖ్య - సాయణుడు ిరిని రాక్షసులుగా చెప్పినాడు. ఇ ్రిములు కావచ్చునని నా ఆలోచన. క్రిములే తమ సంతానమును నాశనము చేసిన క్రిములుండని ఆదర్శ ఆరోగ్య లోకము ఉండును కదా!

4. యాతుధాని - యాతనలు కలిగించు స్త్రీ - తన సంతానమును తినును గాక. తన అక్క చెల్లెళ్లను తినును గాక. తన పౌత్రుల సంతానమును తినును గాక. తదుపరి ఒకరి జుట్టు ఒకరు పట్టుకొని కొట్టుకొని వారు చత్తురు గాక. దానమునకు అడ్డువచ్చు యాతుధానులు ఒకరిని ఒకరు కొట్టుకొని చత్తురు గాక.

## ఆరవ అనువాకము

## మొదటి సూక్తము - 29

ినియోగము :-

1. శత్రు మర్దిత రాజ్యాభివృద్ధికి మొదటి నాలుగు మంత్రములచే చక్రనేి మణిని సంపాతిత, అభిమంత్రితములు చేయవలెను. 5, 6 మంత్రములు చదువుచు "ఉత్తమాభ్యాం" ఉత్తమములందు కట్టవలెను.

2. లోహము, సీసము, వెండి, రాగితో కూడిన స్వర్ణ నాభిని పెరుగు, తేనెల గిన్నెలో

త్రయోదశి నుంచి మూడు రోజులు ఉంచవలెను. 'అభివర్తేన' అను మొదటి సూక్తముతో కట్టవలెను. దారము లోనికి తొడిగి దర్భలపై ఉంచి, హోమము చేసి ఉత్తమములకు కట్టవలెను.

3. మహేన్ద్రం రాజ్య కామస్య అద్భుతోత్పత్తి ికారేషుచ.

1. ఇంద్రుడు ఏ మహిమగల మణి వలన వర్ధిల్లినాడో అట్టి మణి మాకు లభించును గాక. బ్రహ్మణస్పతీ! అనుగ్రహింపుము. మా రక్షణలందు శత్రుభయ రహిత రాజ్యమును వర్ధిల్ల చేయుము.

2. అభివర్తమణీ! మాకు బంధువుల వంటి స్వాభాిక శత్రువులున్నారే వారిని ఎదిరించి ఓడించుము. మా రాజ్యమును, ధనమును అపహరించ దలచిన శత్రుసేనను కూడ నీవే ఎదిరించుము. ఓడించుము.

3. మణీ! సూర్యుడు నిన్ను వర్ధిల్ల చేయును గాక. సోమదేవత వర్ధిల్ల చేయును గాక. సకల చరాచర ప్రాణులు నిన్ను వర్ధిల్ల చేయుచున్న. నిన్ను ధరించిన పురుషుని ప్రతాపమును తన రాజ్యమునందును, అన్య రాజ్యములందును వ్యాపింప చేయుచున్నావు.

4. మణీ! నీవు అభివర్తన సాధనవు. శత్రుదమనవు. శత్రుక్షయము చేయుదానవు. నీవు శత్రుపీడిత రాజ్యమును ముందు అభివృద్ధి చెందించుము. తదుపరి శత్రువును నాశనము చేయుము.

వ్యాఖ్య :- రాజ్యము యుద్ధము వలన ధ్వంసమైనది. శత్రువశమైనది. ముందు ప్రజ, దేశము వర్ధిల్లవలె. అప్పుడే కదా రాజ్యము నిలుచునది. కావున శత్రువు ఏలుబడిలో ఉన్నను రాజ్యము అభివృద్ధి చెందవలెననుట ఉదాత్త ఆశయము!

5. ఉదయించినాడు సూర్యుడు. వెలువడినది నానుండి శత్రుపరాభవ మంత్రము. నేను అభివర్తమణిని ధరించినాను. శత్రువును హతమార్చు వాడనైనాను. నా వాక్కు, సూర్యుడు ఉభయులు ఉదయించినారు.

6. నేను శత్రునాశకుడను అయినాను. నా ప్రజ కోరికలు తీర్చువాడను అయినాను. స్వ, పర రాజ్యములకు ప్రభువును అయినాను.

మణీ! నేను మణిని ధరించిన వాడను. మరల మరల శత్రువును అణచివేయుచుందును గాక. పూర్వము నన్ను బాధించిన సేనకు, నాసేనకు, అన్య ప్రజకు నేను అధిపతిని అగుదును గాక.

## రెండవ సూక్తము - 30

ినియోగము :-

1. ఆయుష్కర్మయందు. స్థాలీపాకమును మూడు ఘృత పిండములు చేయవలెను. సంపాత, అభిమంత్రణముల తరువాత వానిని తినవలెను.

2. ఉపాకర్మమున వటువు నాభిని తాకి జపించవలెను.

3. ఆయుష్కామపు వైశ్వదేవయాగమున, దాని ఉపస్థానమున

4. అధ్యాయపు ఉత్సర్జన కర్మయందు, ఘృత హోమమున.

5. ఐరావతాఖ్య మహాశాంతి యందు.

6. మూడవ మంత్రము దర్శ పూర్ణమాసములందు.

1. ిశ్వదేవతలారా! వసుదేవతా! ఇతడు అయుష్యము కోరుచున్నాడు. ఇతనిని రక్షించండి.

ఆదిత్యులారా! ఇతని ిషయమున అప్రమత్తులై ఉండండి. దేవతలచే రక్షించబడుచున్న ఈతడు

సమస్త బాధల నుండి ిముక్తుడై జీించును గాక.

2. దేవతల పితరులారా! పుత్రులారా! నా వాక్కును సావధానులై ఆలకించండి. శుభములు కలిగించమని ఇతనిని ీకు వప్పగించుచున్నాను. ఇతనిని వార్థక్యము వరకు రక్షించండి.

3. ద్యులోకము నందలి దేవతలారా! పృథిి ీంది దేవతలారా! అంతరిక్షము నందలి దేవతలారా! ఓషధులు, పశువులు, జలములందున్న దేవతలారా! ఈ ఆయుష్కాిు ఆయువును వార్థక్యము వరకు పెంచండి. ఇతడు నూరేళ్లు జీించును గాక. ఇతని అపమృత్యువును నివారించండి.

4. ప్రయాజ, అనుయాజ, హుతభాగ, ఆహుతి గ్రహీత దేవతలారా! అయిదు దిశల అధిష్ఠాన దేవతలారా! ఈ ఆయుష్కాిుకి ఆయుర్వర్ధనాదులు కలిగించుటకు ిమ్ము అతనికి తోటి వారిని చేయుచున్నాను.

వ్యాఖ్య - 1. ఛందోదేవత 2. ఋతుదేవత 3. పశుదేవత 4. ఆత్మదేవత 5. అగ్నిదేవతలు ప్రయాజ దేవతలు.

ప్రధాన యాగము తరువాతి మూడు యాగములు దేవతలు అనుయాజులు.

ఆహుతులందు భాగము గల ఇంద్రాదులు హుతభాగులు.

అగ్నిలో కాక వేరోచోట పడిన హిి భక్షకులు ఆహుతి గ్రహీతలు.

## మూడవ సూక్తము - 31

ినియోగము :-

1. నిత్య, నైిత్తిక కామ్యములగు 22 సవనయజ్ఞ ిధానము చెప్పబడినది. ఈ సూక్తముచే నిరుప్త హిి యొక్క అభిమర్శన, సంపాత, దాతృవాచన, దానములు చేయవలెను. సవన యజ్ఞములు :- 1. బ్రహ్మౌదన, 2. స్వర్గౌదన, 3. చతుః శరావౌదన 4,5. శతౌదనములు 6. అఔదన 7. పంచౌదన, 8. బ్రహ్మాస్యౌదన 9. మృత్యుసవ 10,11. అనుడుత్సవ 12. కర్కి 13,14. పృశ్ని 15. పౌన 16. సిల, 17. పిత్ర 18. ఉర్వర 19. ఋషభ 20. వశ 21. శాలా 22. బృహస్పతి.

2. ధూమకేతు దర్శనము అయినపుడు ఈ సూక్తముచే దిగ్దేవతకు బహురూప అజ అవదానము చేయవలెను. ఆ దేవతకు చరు పురోడాశములచే హోమము చేయవలెను.

3. సకల వ్యాధుల చికిత్స యందు ఈ సూక్తపు మొదటి మంత్రముచే స్నాన అవసేచన, పాయనాదులు చేయవలెను.

4. సకల వ్యాధుల చికిత్స యందు ఈ సూక్తపు మొదటి మంత్రముచే స్నాన, అవసేచన పాయనాదులు చేయవలెను.

5. బ్రహ్మ అశ్వమేధమున ంిడిచిన అశ్వమును ఈ సూక్తముచే అను మంత్రణము

చేయవలెను.

6. " అంహోలింగానాం ఆపోభోజన హంంషి "

7. అద్భుత మహాశాంతి యందు దిగ్దేవతకు తొలి మంత్రము ంనియోగము.

8. సర్వస్వస్త్యయనము కోరువాడు 4వ మంత్రముచే రాత్రిపూట ఉపస్థానము చేయవలెను.

1. అమృతములగు నాలుగు దిక్కులకు, దిక్పాలకులకు, భూతముల అధి దేవతలకు ఈ చతుఃశరావ యాగమున హంస్సులు అర్పించుచున్నాము. సేంంచుచున్నాము.

2. నాలుగు దిశలను పాలించు దిక్పాలులారా! ంరు మమ్ము మృత్యు పాశము నుండి రక్షించండి. అన్య పాశముల నుండి కూడ రక్షించండి.

3. ధన దేవతా! నా శ్రమను లెక్కచేయక నీకు హంస్సులు అర్పించుచున్నాను. 'శ్రోణ' వ్యాధి ంముక్తుడనై ఘృతాహుతులు అర్పించుచున్నాను. దిక్పాలకులందలి నాలుగవ దేవత మాకు ప్రసన్నుడు అగునుగాక. కోరిన ధనములను ప్రసాదించును గాక.

4. మా తల్లికి, తండ్రికి, గోవులకు, సమస్త లోకములకు స్వస్తియగును గాక. మా తల్లి మున్నగు వారు శోభన దనవంతులు అగుదురు గాక. మేము చిరకాలము సూర్యుని దర్శింతుము గాక.

## నాలుగవ సూక్తము - 32

ంనియోగము : -

1. వంధ్యకు సంతానము కలుగుటకు శంు స్నానము చేయించవలెను. ఈ సూక్తముతో ఆమెకు పురోడాశపు ముద్ద ఇచ్చి అలంకారము చేయవలెను.

2. ధనము, బలము అర్థించువాడు ఈ సూక్తముచే ద్యావాపృథ్వి యాగము చేయవలెను.

3. దర్శపూర్ణమాస యాగమున మొదటి మంత్రముచే భార్య ఉదక పాత్ర ఉంచబడును.

1. జనులారా! ంనండి. తెలిసికొనండి. మహాబ్రహ్మ చెప్పుచున్నాడు :-

అది ఈ లోకమున లేదు. ఆ లోకమున లేదు. ప్రాణులందు నిలిచి ఉన్నది.

వ్యాఖ్య - సాయణాచార్యులు " తత్ " అనగా " ఉదకాత్మకం బ్రహ్మ " అన్నారు. అట్లయిన జలము ఉభయ లోకములందు లేదు. ప్రాణులందు ఉన్నది అని అర్థము.

నీరు ఉన్నచోటనే ప్రాణులుండును. అన్యగ్రహములందు ప్రాణులు లేక పోవుట నీరు లేక పోవుట వలననే అని శాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు.

2. (జలము ప్రాణులందు ఉన్నదని చెప్పి స్థానమును నిరూపించుచున్నారు.) xఇది అంతరిక్షమున - యక్షగంధర్వుల వలె - నిలిచిఉన్నది. ఈ లోకమున జలము స్థావర జంగమాత్మకమై ఉన్నది. జలము యొక్క మూల స్థానమును ఎరింగిన వారు ఉన్నారో? లేరో?

వ్యాఖ్య :- " అన్తరిక్షే మహత్ సముద్రం ితతం అస్తి " అన్నాడు పతంజలి. యాస్కుడు కూడ అదే మాట అన్నాడు. " అస్మిత్ మహత్యర్ణవే అన్తరిక్షే " అని శ్రుతి.

జలపు మూల స్థానమేది? దానిని తెలిసిన వాడు నేటికి లేడు. మానవునికి జ్ఞానము పర్యాప్తము. అది వాడుక తెలియగలదు! మూలమును తెలియజాలదు!!

3. ద్యావాపృథ్వులు అక్షయమగు జలమును పుట్టించుచున్ని. ఇి జలమును అంతరిక్షమునకు చేర్చుచున్ని. అంతరిక్షము ఆ జలములను దాచుకొనదు. వర్షించును. అట్లయ్యు అక్కడి జలము వడిసిపోదు.

మానవుడు తప్ప ప్రకృతి శక్తులు దేనిని దాచుకొనవు. ఇచ్చుటే వాని పని. అయినను తరగవు.

4. ద్యులోకము ిశ్వమును ఆవరించి ఉన్నది. పృథ్వి ిశ్వమును ఆశ్రయించి ఉన్నది. కావున ిశ్వజ్ఞానము గల ద్యులోకమునకు ిశ్వమునకు ఆధార భూతమగు భూిికి నమస్కరించుచున్నాను.

వ్యాఖ్య - ిశ్వము సమస్త సృష్టి యగును. మనము కూడ సృష్టియే. మనము భూిిని ఆశ్రయించి ఉన్నాము. ద్యౌ మనను ఆవరించి ఉన్నది. భూలోక ద్యులోక, అంతరిక్షములు కాక "ిశ్వము"

అను మరొకటి చేరినది. ఇంతవరకు ిశ్వము అనిన సమస్తము అయినది - ిశ్వేదేవతలు సమస్త దేవతలు.

## ఐదవ సూక్తము - 33

ినియోగము :-

1. ఈ సూక్త పాఠము నాలుగవ సూక్తమున వచ్చినది. అదే ినియోగము.

2. గోదానమప్పుడు ముండనము తరువాత ఈ సూక్తముతో బాలకునికి స్నానము చేయించవలెను.

3. మధుపర్క, పాద్యోదక అభిమంత్రణమున దీనిని చదవవలెను.

4. ఎడారిలో జలము కలిగినపుడు ఈ సూక్తముచే ఘృత హోమము చేయవలెను.

5. కుండ పగిలి పోయినపుడు కొత్తకుండ తెచ్చి దీనితో అభిమంత్రించి నీరు నింపవలెను.

1. జలము రమణీయ వర్ణపుది. శుచియైనది. పంత్రము చేయునది. జలము నుండియే సూర్యుడు, అగ్ని ఆంర్భంంచినారు.

అగ్నిని గర్భమున దాల్చిన మంచి వర్ణపు జలము మమ్ము వ్యాధి రహితులను చేసి, మాకు శుభములు కలిగించును గాత - " యా అగ్నిం గర్భం దధితే సువర్ణాస్తాన ఆపః శం స్యోనా భవంతు. "

2. ఏ జలమందు వరుణుడు వసించి జనుల సత్యానృతములను పరిశీలించునో -

" యా అగ్నిం గర్భం దధిరే సువర్ణా స్తాన ఆపః శంస్యోనా భవస్తు. "

3. ఏ జలమును దేవతలు దింయందు అమృతముగా సేంంతురో - ఏ జలము అంతరిక్షమున ంంధ రూపములు దాల్చునో

" యా అగ్నిం గర్భం దధిరే సువర్ణాస్తాన ఆపః శం స్యోనాభవస్తు. "

4. జలమా! నన్ను శుభంకర దృష్టితో చూడుము. నీ శుభంకర చర్మముతో నా చర్మమును తాకుము.

అమృతము కురిపించు, శుచివంత, పావక జలము మమ్ము వ్యాధిరహితులను చేసి, మాకు శుభములు కలిగించును గాక.

## ఆరవ సూక్తము - 34

ంనియోగము :-
1. సభాజయమునకు గాను సభలో ప్రవేశించక ముందు దీనితో 'మధూక' మను 'ంరూధ' మును భక్షించవలెను.

2. ంవాహమందు ఈ సూక్తముచే మధూక మణిని రక్త సూత్రమున కట్టి వేలుకు కట్టుకొనవలెను.

3. ివాహపు చతుర్థ కర్మయందు 'మధూక' దంచి 'ఓక్షము' న ఉంచి ఈ సూక్తముచే అభిమంత్రించి వధూవరులు సంగ౦ంచవలెను.

4. అశ్వమేధే బ్రహ్మోద్య వదనేపి ఏతత్ సూక్తమ్.

1. ఇది "ిరుల్లత". ఇది మధురమున పుట్టినది. మధురముగనే నిన్ను త్రవ్వుచున్నాను. నీవు

మధురముగ పుట్టిన దానవు. మమ్ము మధుర రస యుక్తులను చేయుము.

2. మధూలకమా! నా జిహ్వాగ్రమున నిలుపుము. జిహ్వ మూలమున నిలుపుము. నా

దేహమున నిలుపుము. నా చిత్తమున నిలుపుము. అన్నింటిని మధురరస యుక్తముచేయుము.

3. నా రాక మధుమయము నా పోక మధుమయము అగును గాక. నా మాట మధురము, నా చేత మధురమగును గాక. అన్యులకు నేను మధుమయుడను అగుదును గాక.

4. మధూలకమా! నేను నీ దాపున ఉన్నాను. నేను మధువుగ, మధుతరముగ, మధుతమముగ చేయుము. తేనె పట్టు గల కొమ్మను సకల జనులు సే౦ంచినట్లు నన్ను సే౦ంతురు గాక.

5. ధర్మపత్నీ! చెరుకు గడ అంతటను మాధుర్యము నిండి ఉండును కదా! అట్లే నాలో మొత్తము మధుర రసము నింపుకొని నిన్ను పరిగ్రహించుచున్నాను. మనము ఉభయులము పరస్పరము ద్వేషరహితులమై ఉందుము గాక. భార్యగా నీవు నన్ను కోరునట్లును. నన్ను ిడువకుండునట్లును ఉండుటకు చేరినాను.

వ్యాఖ్య :- తీయని మాటయే అన్నింట జయము కలిగించును. ద్వేషము, కటు వాక్య ప్రయోజన రహితము. సమాజమున స్నేహమే, ప్రేమయే వర్థిల్లవలెను అనుచున్నాడు. ఇంతకు ౦ంచి మానవ జాతి ఆశించవలసిన దే౦?

6. దాంపత్య ిషయమున ఎంత మధురముగా చెప్పినాడు? చెరుకు గడ నిండుగా తీపియే.

రవ్వంత చేదుండదు. తన యందంతటను అంతటి తీపిని నింపుకొని భార్య వద్దకు వచ్చినాడట!

ఎంతటి ఆదర్శ దాంపత్యము! దాంపత్యమే కదా సమాజమునకు మూలము!! సమాజము ఎంతటి మధుర మగును !!!!

## ఏడవ సూక్తము - 35

ినియోగము :-

1. సర్వ సంపత్కర్మ యందు త్రయోదశి మొదలు మూడు రోజులు నీలిమను పెరుగు తేనెలో ఉంచి తదుపరి మణిని తీసి కట్టవలెను. ఒకే దూడగల ఆవు పాలతో అన్నము వండవలెను. దానిలో మనిషి బొమ్మ గీసి దానిని తినవలెను.

2. ఆయుష్యకాం హిరణ్య మణిని, రెండు నీలిమలను సంపాతిత, అభిమంత్రణము చేసి, స్థాలీపాకమును సహితము సంపాతిత, అభిమంత్రణ చేసి మణులను కట్టవలెను. అన్నము తిన వలెను.

3. ఉపనయనమున ఆయువు ఆశించు బ్రహ్మచారి ఈ సూక్తముచే ఘృత హోమము చేయవలెను.

4. ిహితానాం ఆదిత్యాఖ్యానాం మహాశాన్తౌ యుగ్మ కృష్ణల మణిబన్ధ నేపి ఏతత్ సూక్తమ్.

5. ప్రతిరోజు ఉదయము పురోహితుడు ఈ సూక్తమున అలంకారములను అభిమంత్రించి రాజుకు ఇవ్వవలెను.

6. హిరణ్య గర్భమును మహాదానమున ఈ సూక్తముచే సువర్ణమాలను యజమానికి ఇవ్వవలెను.

1. పూర్వము దక్షగోత్రజులు, సుమనస్కులగు ఋషులు 'శతానీకుడు' అనువానికి హృదయానందకరమగు నీలిమాది సువర్ణమణిని కట్టినారు. నీ యొక్క ఆయుష్యము పెరుగుటకు, నీకు తేజస్సు, బలము, శతాయువు కలుగుటకును అట్టి నీలిమాది సువర్ణమణిని కట్టుచున్నాను.

2. హిరణ్యమణి కట్టుకున్న వారిని రాక్షసులు, పిశాచములు బాధించవు. ఈ హిరణ్యము దేవతల ఓజస్సు కలది. దేవతల కన్న పూర్వము పుట్టినది. రక్షించు దాక్షాయణ హిరణ్యము ధరించినవాడు శతాయుష్కుడు అగుచున్నాడు.

3. హిరణ్యము ధరించిన వాని యందు జలముల తేజమును, సూర్యచంద్రుల జ్యోతిని, మహాపురుషుల బలమును, వనస్పతుల సామర్థ్యమును, ఇంద్రుని అసాధారణ చిహ్నములను స్థాపించుచున్నాము.

4. హిరణ్యము ధరించిన వాని ఋతువులను మాసములను పరిపూర్ణము చేయుచున్నాను. సంవత్సర పర్యంతపు దగ్ధములతోను, సంవత్సరముల పర్యంతము నిలుచు గో, ధన, ధాన్య సమృద్ధి కలిగించుచున్నాను. ఇంద్రాగ్నులు, ిశ్వే దేవతలు ఆ కర్మ యందలి లోపములను మన్నింతురు గాక. ఫల ప్రాప్తి అనుగ్రహింతురు గాక.

వ్యాఖ్య : - బంగారము సంపద మాత్రము కాదు. ఇది ఆయుర్వేదమున ఔషధములందు చేరి మహోపకారము చేయుచున్నది. సువర్ణ వాతచింతామణి, సువర్ణ సూర్యావర్తి, సువర్ణ మకర ధ్వజము కొన్ని ఔషధములు.

సువర్ణము, మణులు శరీరమునకు తాకు చుండుట ఆరోగ్యకరము ఆయుర్వర్ధనము. అందువలన బంగారునగలు, మణులు ధరించుటను నాగరకము చేసినారు. ఈ ిషయమును ఇప్పుడిప్పుడే ఆధునిక వైద్యము గుర్తించుచున్నది.

దాశరథి లక్ష్మణాచార్య బుచ్చమాంబల పౌత్రుండును,
ిద్వాన్ వేంకటాచార్య వేంకటాంబల పుత్రుండును, ఆంధ్రప్రదేశ్
ఆస్థానకి దాశరథి కృష్ణ
మాచార్య అనుజుండును, కమలానాిన్న ధర్మ పత్నీ సమేతుండును
శ్రీమదాంధ్ర వచన
ఋగ్వేద సంహిత, శ్రీమదాంధ్ర వచన వాజసనేయ
మాధ్యందినశుక్లయజుర్వేద సంహిత
శ్రీమదాంధ్రవచన కృష్ణయజుర్వేదీయ తైత్తరీయ సంహిత,
శ్రీమదాంధ్ర వచన సామవేద
సంహిత ఇత్యాద్యనేక గ్రంథ కర్తయునగు దాశరథి రంగాచార్య
ిరచిత
శ్రీమదాంధ్రవచన అథర్వవేద సంహిత యందలి మొదటి కాండము
సమాప్తము.

యస్య నిఃశ్వసితం వేదా యో వేదేభ్యో %ఖిలం జగత్ ।

నిర్మమే తమహం వన్దే ిధ్యాతీర్థ మహేశ్వరమ్ ॥

## శ్రీమదాంధ్ర వచన అథర్వ వేద సంహిత *రెండవ కాండ*

## మొదటి అనువాకము

## మొదటి సూక్తము - 1

వేనస్తత్ పశ్యత్ పరమం గుహాయద్ యత్ర ిశ్వం భవత్యేకరూపం ।

ఇదం పృశ్నిరదుజ్ఞాయమానాః స్వర్విదో అభ్యఞూషత వ్రాః ॥

ినియోగము :-

1. కార్య సిద్ధి అగునా లేదా అని తెలిసికొనుటకు :-

అయిదు గణుపుల వెదురు కర్రను సమతల ప్రదేశమున నిలుపవలెను. అది అనుకున్న వైపు కార్య సిద్ధి అగును.

2. బాణమును ఎక్కుపెట్టి, ఈ సూక్తమున అభిమంత్రించి ొదువవలెను. అది లక్ష్యము చేరిన కార్యసిద్ధి అగును.

3. నీరు నిండిన కుండ లేక కమండలములో పాలు పోసి మనసులో ప్రార్థించవలెను. అనుకున్న రీతి హెచ్చు తగ్గులు కార్యసిద్ధిని సూచించును.

4. దర్భలకట్టను ఈ సూక్తముచే అభిమంత్రించి లెక్కించవలెను. సమసంఖ్య కార్యసిద్ధిని సూచించును.

5. వంట చెరుకు ఈ సూక్తముచే అభిమంత్రించి అగ్నిలో వేయవలెను. ప్రదక్షిణ పూర్తియగు వరకు మండిన కార్యసిద్ధి కలుగును.

6. పాచికలను అభిమంత్రించి వేయవలెను. అనుకున్న సంఖ్య పడిన కార్యసిద్ధి.

7. రెండు చేతులు రెండు వ్రేళ్లను అభిమంత్రించి యోచించవలెను. అనుకున్న వేలు తాకిన కార్యసిద్ధి.

8. 21 ఇసుక రేణువులను అభిమంత్రించి ొభజించవలెను. లెక్కపెట్టగా అనుకున్న సరి/బేసి సంఖ్యలు కార్యసిద్ధిని సూచించును.

9. పోయిన వస్తువు జాడ తెలుసుకొనుటకు నూరునిండిన కుండ లేక నాగలి లేక పాచికను గుడ్డచే కప్పవలెను. రజస్వల కానట్టి ఇద్దరు బాలికలను వాటిని తీసికొని పొమ్మనవలెను. వారు వెళ్లిన దిక్కున జాడ తెలియును.

10. పెళ్లికి ముందు కుమారి సౌభాగ్యము తెలిసికోనుటకు పొలపు మట్టిగడ్డ, పుట్ట మట్టిగడ్డ, చౌరస్తా మట్టిగడ్డ, శ్మశాన మట్టిగడ్డను తెచ్చి అభిమంత్రించి అమ్మాయిని తాకమనవలెను. పొలపు మట్టి, పుట్ట మట్టిని తాకిన సౌభాగ్యవతి అగును. చౌరస్తామట్టిని తాకిన మరణము సంభొంచును.

11. కుమారి దోసిలిలో నీరు పోసి - అభిమంత్రించి - పారపోయమనవలెను. తూర్పు దిక్కుకు పోసిన కళ్యాణమగును.

12. మూడవ మంత్రము అగ్ని చయసనమున పురోడాశ గృహీత ఉత్తరార్థ ఘృతముచే వైశ్వకర్మ హోమమున ొనియోగము.

1. ఆదిత్యుడు పరమగుహ్యమును దర్శించినాడు. ిశ్వమంతయు ఏకరూపమగు ప్రదేశమును దర్శించినాడు. అప్రకటితమగు ఈ చరాచర జగత్తును సూర్యకిరణములు ప్రకటించిని. జన్మించిన సమస్త ప్రజ అట్టి ఆదిత్యుని ఎరుంగును. అర్చించును.

**మరొక అర్థము.**

సమస్త ిశ్వము జీించుటకు జలమే ఏకమాత్ర కారణమై ఉన్నది. ఈ సమస్త ిశ్వము జలమునందే ఐక్యమగుచున్నది. మధ్యస్థానమున ఉన్న పర్జన్యుడు దీనిని ఎరుంగును. ఆదిత్య మండలమున నిలిచి ఉన్న గుహ్య జలమును దర్శించినాడు. ఆ సూర్యుడు వర్షము కలిగించునని అది సకల ఉత్పత్తి కారకమని ప్రజలకు తెలియును. వారు సూర్యుని స్తుతింతురు.

2. అమృతము తెలిసిన ిద్వాంసులు సూర్యుని పరమగుహ్య స్థానమును ఉపదేశింతురు గాక. ఆ గుహ్యమందలి మూడు పదములను తెలిసినవాడు తండ్రులకు తండ్రి అగుచున్నాడు.

3. అతడు నా పాలకుడు. నన్ను సృజించినవాడు. అతడే బంధువు. అతడు ిశ్వమందలి

సకల ధర్మములను తెలిసినవాడు. అతడు ఒక్కడే సమస్త దేవతల పేర్లు గలవాడు. లోకములందలి సకల సంప్రశ్నలు అతనిని గురించినవే!

4. ( **జ్ఞానోత్తర కాలం తత్త్వంద్బ్రూతే** - జ్ఞానము కలిగిన తరువాత తత్త్వ ిదుడు అనుచున్నాడు.)

మాట్లాడు వాని మాటను దగ్గర ఉండువారు వెంటనే స్పష్టముగా ినుచున్నారు. అట్లే నేను ద్యావాపృథ్యులను పొందినాను. నేనే తొలుత పుట్టిన అమృత స్వరూపుడను అగుచున్నాను.

5. ఎచట దేవతలు అమృతము ఆరగించుచున్నారో ఎచట దేవతలు ఒకే మూలమును

ఆశ్రయించినారో ఆ స్థలమును తెలిసికొన్నాను. సకల భువనములు ఏ పాప పుణ్యముల దారములతో కట్టబడి ఉన్నవో ఆ దారములు తెగుటను దర్శించినాను.

## రెండవ సూక్తము - 2

1. గంధర్వ, రాక్షస, అప్సర, గ్రహాది శాంతులందు ఘృతప్లుత సర్వోషధి హోమమున చతుష్పథమందు గ్రహ గృహీశిరః స్థితమృణ్మయ కపాలాగ్ని హోమాదులందు.

2. ఘృత, మాంస, సువర్ణ, ధూళి మున్నగు భయంకర వర్షమందు కోతులు, కుక్కలు, నక్కలు, కప్పలు ిపరీతముగా ప్రవర్తించునపుడు ఈ సూక్తముచే ఘృతాహుతులు ఇవ్వవలెను.

3. గ్రహ యజ్ఞమున ప్రధాన హోమము తదుపరి శాంతి కొరకు ఘృతాహుతులందు.

4. మహా శాంత్యాదులందు మాతృనామ గణము వచ్చినపుడు దీనిని చదువవలెను.

5. అశ్వమేధ యజ్ఞమున బ్రహ్మసమ్వత్సరాంతమున యుజ్యమాన అశ్వమును తొలిమంత్రమున అనుమంత్రితము చేయవలెను.

1. దివ్యసూర్యుడు, భువనపతి ఒక్కరే. అతడు నమస్కరించ దగినవాడు. స్తుతించదగినవాడు. నేను ఆ సూర్యుని, ఈ భువన పతిని బ్రహ్మగా భావించుచున్నాను. మీరు దివ్యులు. దేవతలు. స్వర్గవాసులు. మీకు నమస్కరించుచున్నాము.

2. సూర్యుడు ఆకసమున ఉన్నవాడు. పూజ్యుడు. గంధర్వుడు. సూర్యుని వంటివాడు. దేవతల కోపము చల్లార్చగలవాడు. ఈ భువన పతిని బ్రహ్మగా భావించుచున్నాను. మీరు దివ్యులు. దేవతలు. స్వర్గవాసులు. మీకు నమస్కరించుచున్నాము.

3. కిరణరూప అప్సరసలతో సూర్యరూప గంధర్వుడు కలిసిపోయినాడు. అప్సరసలతో కూడ సూర్య నామక గంధర్వుడు కలిసి పోయినాడు. ప్రాణులను ఆనందపరచు అప్సరసల స్థానము సముద్రనామక సూర్యుడై ఉన్నాడు. 'మంత్ర దృష్ట వచనం ఏతత్'

సూర్యోదయముతో కిరణములు వెడలును. అస్తమించినంత కిరణములు సూర్యునిలో లీనమగును.

అప్సరసల, గంధర్వుల స్థానము అంతరిక్షమగును. అచటి నుండియే ప్రజలను పీడించుటకు వత్తురు. పిదప అంతర్ధానులగుదురు.

4. ఆకసమందలి మబ్బున మెరయునట్టి నక్షత్రరూప అప్సరసలారా! మీలో విశ్వావసు గంధర్వునితో కూడిన వారికి, ప్రకాశవంతులకు నేను నమస్కరించుచున్నాను

5. గంధర్వ పత్నులగు అప్సరసలు నరులకు ఉపద్రవములు కలిగింతురు. వారిని ఏడిపింతురు. అవయవములకు హాని కలిగింతురు. ఉన్మాదము కలిగింతురు. అట్టి గంధర్వ పత్నులకు నమస్కరించుచున్నాను . వారికి హవి సమర్పించుచున్నాను.

## మూడవ సూక్తము - 3

వినియోగము :- అతిసారము, అతిమూత్రము, నాడీ వ్రణపు శాంతికి, ముంజశిరోనిర్మిత రజ్జు బంధనం. చేను మట్టి త్రాగించుట. సర్పిలేపనము. చర్మదృతి ముఖమున అపాన శిశ్నునాడీ వ్రణ ముఖముల ధమనము.

ముంజవాన్ పర్వతము సర్వశ్రేష్ఠము ప్రసిద్ధము. దాని మీద వ్యాధిని నివారించునట్టి "ముంజ' నేలమీద వ్యాపించి ఉండును.

ముంజమా! నీ అగ్రభాగమును వ్యాధి నివారణ ఔషధముగా చేయుచున్నాను. నిన్ను

వ్యాధి నివారక, సమర్థ, పరమ ీర్యవంత ఔషధమును చేయుచున్నాను.

2. ఔషధమా! నిన్ను వాడగనే వ్యాధిని దూరము చేయుము. మరల వచ్చు వ్యాధులను నష్టపరచుము. నీ జాతివారు అనేకులున్నారు. వారిలో నీవు శ్రేష్ఠమవు. నీవు రోగమునుస నివారించుట మాత్రము కాదు. నిర్మూలించు దానవు.

వ్యాఖ్య - అత్యంత ఆధునిక వైద్యుడు సహితము నివారణను గురించి మాత్రమే ఆలోచించుచున్నది. ఒకసారి రోగి నిత్య రోగి అగుచున్నాడు. జీ ితకాలము మందులు తప్పుట లేదు.

ఆ కాలమున "అరోగిణమ్" రోగము లేని వాని గురించి, రోగ నిర్మూలమును గురించి ఆలోచించినారు. అట్టి ఆలోచన నేటికిని కొనసాగుతున్నది.

మనము మందుల వ్యాపారము పెంచుటను ించి సాగలేకున్నాము.

3. ఈ వ్యాధులు అసురులు వంటి ి. ప్రాణములు తీయును. దేహములను కూల్చును. ఇ ి ప్రాణమును లోననుండి తొలుచును. అట్లయిన ఈ 'ముంజ' ఆ స్రావమునకు మహా ఔషధము. అది వ్యాధులను సమూలముగ నాశము చేయుచున్నది.

4. పుట్టలు పెట్టు మట్టి అడుగున ఉన్న జలరాశి రోగ నివారక ఔషధులను నేల ీదికి తెచ్చుచున్నది. ఈ పుట్టమట్టి అస్రావ ఔషధమై ఉన్నది. అది వ్యాధులను సమూలముగ నిర్మూలించుచున్నది.

5. పంట పొలపు మట్టి మహా ఔషధము అగుచున్నది. అది వ్రణములను మాన్పుచున్నది. ఈ మట్టి అస్రావ ఔషధము అయి ఉన్నది. ఇది వ్యాధులను సమూలముగ నిర్మూలించుచున్నది.

6. ఔషధములకు వాడునట్టి నీరు సుఖప్రదము రోగములను శాంతింప చేయునది అగును గాక. రోగములు కలిగించు వానిని ఇంద్రుని వజ్రము హత మార్చును గాక. రాక్షసుల చేతి రోగ

బాణములు మా ీద పడకుండును గాక.

## నాలుగవ సూక్తము - 4

ినియోగము - కృత్య దూషణ, తన రక్షణ, ిఘ్న నివారణకు 'జంగిడ' వృక్షమణిని తాడుతో పేని సంపాత, అభిమంత్రణలు చేసి కట్టవలెను.

1. మాకు బృహదాయువు కలుగుటకును, సకల రక్షణలు సదా కలిగించుటకును, రాక్షసుల రోగగతిని నిరోధించుటకును, శరీరపోషణకు కలుగు అడ్డంకులను దూరము చేయుటకును జంగిడ వృక్షపు మణిని ధరించుచున్నాను.

2. 'జంగిడ' మణి అపార బలము కలది. అది మమ్ము హింసక కృత్యనుండి, రాక్షసుల కోరలనుండి, శరీరమును ముక్కలు, ముక్కలు చేయు రోగముల నుండి సకల దిశలందుండి రక్షించును గాక.

3. జంగిడ మణి ◌శ్వభేషజము. అది మమ్ము ఇతరులు చేయు ఉపద్రవము నుండి రక్షించుచున్నది. భక్షించు వారినుండి కాపాడుచున్నది. అది మమ్ము పాపముల నుండి రక్షించును గాక.

4. జంగిడ మణి సుఖములను కలిగించునది. దేవతలచే ప్రసాదించబడినది. ఇది సకల ◌ఘ్నములను నివారించునది. రాక్షస సంచారమును నివారించుచున్నది.

5. జంగిడయు,మణికి కట్టినత్రాడును మమ్ముసకల దిశలందురక్షించును గాక. జంగిడఅరణ్యము నుండి,త్రాడు కృషిరసము నుంచివచ్చిన◌. ఇ◌ మమ్ముసకల ◌ఘ్నములనుండి రక్షించునుగాక.

6. ఈజంగిడ మణిఅభిచారాది 'కృత్య'దోషములను నివారించునది.శత్రువులనుతొలగించునది.బలశాలి. ఈ మణిమా ఆయువులనుపెంచును గాక.

వ్యాఖ్య:- 1) మానవుడు రోగరహితుడు,చిరంజీ◌ కావలెననుఆదర్శము - ఆరాటముఈనాటిది కాదు. ఇదిమానవుని తోనేపుట్టినది. ఆ ప్రయత్నమునిరంతరము కొనసాగుచుండును.ఆగదు.

భారతీయవైద్య ◌ధానమగుఆయుర్వేదము ఈ దిశలోచాలవరకు ◌జయవంతమైనది.

ఆయుర్వేదమునకుమూలము వేదమనుటనిర్వివాదము.

అనాదికాలపు ఆయుర్వేదమునకువేదమునకు వలెనేఅనేక ◌ఘ్నములు, అడ్డంకులు,ఆటంకములు కలిగిన◌.ఆటంకములు జీ◌తసత్యము. వానిని అధిగ◌ంచినిలిచినపుడేరాణింపు.

ఈ మధ్యనఆయుర్వేదమునకుఆంగ్లప్రభుత్వమువలన అంతరించిపోవు ప్రమాదముఏర్పడినది. ఆంగ్లేయులుభారత దేశమునుపాలించిన రెండు వందలఏండ్లలో ప్రాచీనభారతదేశమునకుసంబంధించినసమస్తమును నిర్మూలించుటకుతమ ప్రభుత్వపశుబలంతో నిరంతరముప్రయత్నించినారు.

ఆయుర్వేదముఒక వైద్య ిధానముకాదని దానిని నిర్మూలించుటకుఆంగ్ల ప్రభుత్వముపూనుకున్నది. అప్పుడుపండిత రాజ గోపాలాచార్యులవారు ఆయుర్వేద ిధానపుశాస్త్రీయతను నిరూపించుటయేకాక భారత దేశమందంతటనువైద్యాలయములు,ిద్యాలయములుస్థాపించి ఆయుర్వేదమునురక్షించినారు. ఇప్పుడిప్పుడేపాశ్చాత్యులు ఆయుర్వేదమునుప్రశంసించుట ప్రారంభించినారు.

2. ఈసూక్తమున ప్రశంసించబడిన"జంగిడ" ఏకమూలికాసిద్ధాంతము. ఇందుమరొకటి కలువదు.జర్మనీలో హానిమన్అనే మహామహుడుఈ సిద్ధాంతము ీదహోియోపతి అనుఒక చికిత్సా ిధానమునుిజయవంతముగానిర్వచించినారు. ప్రస్తుతముఈ ిధానము ప్రపంచవ్యాప్తముగ ప్రచారములోఉన్నది. ఇది హానికలిగించిన వైద్యిధానము.

3. 'జంగిడ'ఇదే పేరుతో వారణాసిలోలభించుచున్నదనిచెప్పుచున్నారు.ఇప్పటికే దీనిీదపరిశోధనలు జరుగుచుండవచ్చును. వైద్యశాస్త్రజ్ఞులకుతెలియవలెను.

తులసి,వేప మున్నగు వానిీదపాశ్చాత్యులు పరిశోధనలుజరిపి మనకు వేలఏండ్లనాడు తెలిసినఫలితములనుధృీకరించుచున్నారు.వారు 'జంగిడ' ను ిడిచిఉండరు వారు మరొక పేరుతోదానిని మనకే ిక్రయింతురు!

'మణి'అనగా 'రత్నము' 'వ్రజము'అగును. వేదమునఒక్కొక్క చోట 'సువర్ణము'అను అర్థము వచ్చునట్లువాడబడినది.

'మణి'అన్నప్పుడు దారముగుచ్చి లేక చుట్టివాడునది అనియూచెప్పబడినది.ఇది మెడకు తగిలించుకొనునదిగాని ముంజేతికికంకణము వలెకట్టుకొనునదిగాని కావచ్చును. ఈ సూక్తమునకుఈ అర్థమే తగినట్లున్నది.

## ఐదవసూక్తము - 5

ినియోగము:

1) సోమాభిషవమున,అభిషవ హోమమున.

2) షోడశగ్రహ,ఐంద్రోపస్థానమున.

3) ఐంద్రీమహాశాంతిలోదీనిని పఠించవలెను.

1. ఇంద్రదేవా!హర్యశ్వములీద రమ్ము. ప్రసన్నుడమగుము.మాకు కోరిన ఫలములనిమ్ము. అభిశుత,ప్రశంసనీయ సోమమును సేింపుము. అది దశాపిత్రమునపరిశుద్ధమైనది.నిర్మలము నీకు మాదకమైతృప్తి కలిగించుచున్నది.

2. ఇంద్రా!ఈ సోమము స్వర్గమునందలి అమృతమువంటిది. నూతనము.మధుర రసయుతము.దీనితో నీ కడుపు నింపుము.

ఈ సోమముఅభిషుతము. స్తుతియుక్తము. మాదకము.స్వర్గము వంటిది.నీకు ఇచట కూడా లభించుచున్నది.

3. ఇంద్రుడుసోమ పానము చేసినాడు.బలశాలి అయినాడు.ఆ బలమున శత్రువులనుపరిమార్చినాడు. వృత్రునివధించినాడు.భృగువు వంటిఇంద్రుడు అంగిరసులగోవులను తస్కరించినబలాసురుని, వేదవ్యతిరేకినివలె వధించినాడు.

ఇంద్రుడుసకల ప్రాణిజాలములకుమిత్రుడు అగుచున్నాడు.

4. ఇంద్రా!రమ్ము. ఈ సోమమునీలో ప్రవేశించునుగాక. నీ కుక్షి యొక్క రెండుభాగములు నిండిపొర్లును గాక. మా ఆహ్వానమునుఆలకించుము. అనుగ్రహించుము.మా స్తుతిరూప వాణినివినుము. ప్రసన్నుడవగుము.మాకు ఫలసిద్ధి కలిగించుటకునీ మిత్రులగు మరుత్తులసహితుడవైవచ్చి సోమముసేవించుము.

5. ఇంద్రుడువజ్రధారి. అతడుపూర్వము అనేక వీరకృత్యములుచేసినాడు. నేనువానిని చక్కగా వివరించుచున్నాను:-

ఇంద్రుడువృత్రుని వధించినాడు.వృత్రుడు బంధించినజలమును విడిపించినాడు.పర్వతముల నుండినదులను ప్రవహింపచేసినాడు.

6. గోవులవంటి శబ్దముచేయుచు నిరాటంకముగాపల్లమునకు ప్రవహించినదీపతి యగు సముద్రునిచేరు నదులవలె ఇంద్రుడువృత్రుని వధించినాడు.మేఘమును విదీర్ణముచేసినాడు. వృత్రునితండ్రియగు త్వష్టదహించునట్టివజ్రమును ఇంద్రునికొరకు పదును పెట్టినాడు.

7. వృషాయమానుడగు ఇంద్రుడుప్రశంసనీయ సోమముకొరకు ప్రజాపతిని అర్థించినాడు.ఇంద్రుడు 'త్రికద్రుక'సోమయాగమునఅభిశుత సోమముపొందినాడు. ఆ సోమముత్రాగిన బలమునఇంద్రుడు శత్రువునుండి వజ్రాయుధముగ్రహించినాడు.అసురులలో తొలుత పుట్టిన వృత్రునిసంహరించినాడు.

## రెండవఅనువాకము

## మొదటిసూక్తము -6

వినియోగము:-

1) సంపదకోరువాడు దీనిచేఅగ్ని యాగము చేయవలెను.

2) భూత,రోగ, చోరాది భయములసంవత్సరమైనపుడుతచ్ఛాంతి కొరకు దీనిచేఘృతాహుతులుఇవ్వవలెను.

3) అగ్నిచయనమందుప్రజాపతి పశు సా౦ధేనిసమయమున బ్రహ్మదీనిని జపించవలెను.

4) సర్వకామములకు, అగ్ని భయమునకుఆగ్నేయ మహాశాంతియందు దీనిని జపించవలెను.

5) రాత్రిపూట రాజుకు హారతిఇచ్చునపుడు ఇందలి5వ మంత్రముచేవెలిగించవలెను.

1. అగ్నిదేవా!సంవత్సరములునిన్ను వర్ధిల్లచేయునుగాక. ఋతువులు,ఋషులు, నిన్ను సమృద్ధునిచేయును గాక. సత్యస్వరూపులగుపృథివ్యాదులు నిన్నుసమృద్ధుని చేయునుగాక. ఆ సమృద్ధులతోనీవు దివ్యలోకమునతేజరిల్లుము.ఆ తేజస్సుతో ౦శ్వమును,సమస్త దిశలనుప్రకాశింప చేయుము.

2. అగ్నీ!నీవు స్వయముగ ప్రజ్వరిల్లుము.ఇతని కోరికలు తీర్చుము.ఇతనికి మహదైశ్వర్యముకలిగించుటకు ఉత్తిష్ఠ.నిన్ను సే౦౦చు వారికి క్షయముకలుగ కుండును గాక. వారికియశస్సు కలిగించుము.పూజించని వారికి యశస్సుకలుగకుండును గాక.

3. అగ్నిదేవా!ఈ బ్రాహ్మణులునిన్ను ఆరాధించుచున్నారు.వారికి శుభములుకలిగించుము. వారి లోపములనుమన్నించుము.

అగ్నిదేవా!మా శత్రువులనుజయించుము. మాపాపములను పోగొట్టుము.నీ ఇంట అప్రమత్తుడవైగౌరవ ప్రదుడవైవసింపుము.

4. అగ్నీ!నీవు స్వంత బలమునవర్ధిల్లుము.౦ఁత్రులను పోషించుము.వారికి ఉపకారము చేయుము.నీవు సజాతీయులమధ్య నిలువుము.రాజులు చేయు'౦హవ్య ' యజ్ఞమునప్రజ్వరిల్లుము.

5. అగ్నిదేవా!మాకు ౦షయవాసనలందుకలిగిన దోషములనుహతమార్చుము.శరీరమును శుష్కింప చేయురోగములను దూరముచేయుము. పాప బుద్ధినితొలగించుము. మాశత్రువులనుసంహరింపుము. మాసకల దుర్గతులనుదూరము చేయుము.మాకు పుత్ర, పౌత్రాదిసహిత ధనమునుప్రసాదించుము.

## రెండవసూక్తము-7

1) లౌకిక,వైదిక ఆక్రోశము, బ్రాహ్మణశాపము, భ్రష్టు కంటిదృష్టి,యక్షపిశాచుల భయముకలిగినపుడు యవమణి కొరకు హోమముచేసి అభిమంత్రించికట్టవలెను.

2) గ్రహనక్షత్రాదుల వలనకలిగిన రోగములు,భయములనివారణకు భార్గ౦ మహాశాంతి చేయవలెను.

1. ఈయవల రాక్షస, పిశాచములవలన కలిగినబాధలను నివారించున౦.దేవత

వలనకలిగిన శాపాదులనుతొలగించున౦. నీరుశరీరపు మురికిని తొలగించినట్లుఈ యవల నా నుండిశాపాదులను తొలగించునుగాక.

2. శత్రువుక్రోధము, అక్కచెల్లెంద్రఅలక, బ్రాహ్మణునిశాపము నా కాలికింద నలుగునుగాక.

3. ది౦వైపు ముఖము కలిగిమూలము వలెవ్యాపించిన నేల౦దఅనేక గణుపుల యవమొక్కమొలచినది.అట్టి యవ మణీ!నీవు మమ్ము సకలశాపముల నుండి సకలదిశలందు రక్షింపుము.

4. మణీ!నీవు మమ్ము రక్షింపుము.మా పుత్ర పౌత్రాదులనురక్షింపుము. మాకు గలధనమును రక్షింపుము.

మాశత్రువు వర్ధిల్లరాదు.మమ్ము దెబ్బతీయదలచు యక్షపిశాచాదిశత్రువులు మమ్ముతాకకుందురు గాక.

5. శాపముపెట్టు వాని ౦దకే శాపముమరలును గాక. మాకుఅనుకూలుడు మాతోపాటు సుఖించునుగాక. మా ౦షయమునదుర్భావము కలవానిమరియు చాటుమాటుగచాడీలు చెప్పువారి కన్నులు పొడిచివేతము - ప్రక్కటెముకలు౦రిచి వేతము.

## మూడవసూక్తము - 8

౦నియోగము:-

1) వంశపారంపర్యముగావచ్చు కుష్ఠు, క్షయ,సంగ్రహణిమున్నగు రోగ శాంతికిమొదటి మంత్రముచేనిండు నీటికుండనుహోమము, అభిమంత్రణముచేసి ఇంటి బయటరోగికి స్నానము చేయవలెను.

2) ఆవ్యాధులకు అదేరీతిగా రెండవ మంత్రముచేఉషః కాలమున స్నానముచేయుంచవలెను.

3) మూడవమంత్రముచేమద్దికర్ర, యవలపొట్టు, మంజరిసహితనువ్వులను ఒకచోటచేర్చి అభిమంత్రించికట్టవలెను.వట్టి మట్టిలేక పొలము మట్టినిచర్మములలోచుట్టి కట్టవలెను.

4) నాలుగవమంత్రముచేనీటి కుండను అభిమంత్రించిఎద్దులు కట్టిననాగలి కింద స్నానముచేయించవలెను.

5. శూన్యగృహమున ఐదవమంత్రముచేహోమము చేయవలెను.దగ్గర నున్న పాతగుంతలో హోమముచేయవలెను.గుంతలో 'శాలాతృణము'పరచి, దాని ౦ద రోగినికూర్చుండబెట్టి,ఆ నీటితో ఆచమనముచేయించవలెను.నీటిని రోగి ౦ద చల్లవలెను.

1. తేజస్వియగు'ంచృతి' అను నక్షత్రముఉదయించినది. "క్షేత్రియస్య"వంశము నుంచి వచ్చినపాశముల వంటిరోగబంధములుశరీరపు, పై భాగమును,దిగువ భాగమును'ముంచతాం' - ండుచునుగాక.

వ్యాఖ్య- రోగములు వంశపారంపర్యముగావచ్చునని ఆనాడేకనుగొన్నారు. 'వంశము'అనిన

తలిదండ్రులుఅని మాత్రము అర్థముకాదు. వ్యాధులు,గుణబణములు,స్వభావము మున్నగునంఅన్నియు తండ్రిపక్షపు ఏడు తరములనుండి, తల్లితరపు ఏడు తరములనుండి

సంభంంచుచున్నం.అందుకే పెండ్లి 'ఏడేడుజన్మల బంధము'అగుచున్నది.

ఒకవ్యక్తికివ్యాధులు సహితముగసర్వము వంశ పారంపర్యముకావుననే ఆస్తులు,అప్పులు సహితమువంశ పారంపర్యమగుచున్నది.

ఇస్లాంధర్మమున సుదూరబంధువులకుసహితము ఆస్తిలోభాగము కల్పించబడినది.

నేటిపాశ్చాత్య వైద్యంధానమున "కుష్ఠు"వంశ క్రమానుగతముగవచ్చిన వ్యాధికాదు అనుచున్నారు.పరిశోధనకు అంతముగాని నిర్దిష్టత గాని లేవు.నేడు అవునన్నదిరేపు కాదనుట, కాదన్నదిఔననుటకు అనేక ఉదాహరణలుఉన్నం.

సృష్టియందు పరిపూర్ణతదేనికిని లేదు!

2. ఉషఃకాలము చీకట్లనుమాయము చేసినట్లుఈ క్షేత్రీయ వ్యాధినిమాయము చేయునుగాక. రోగ శాంతి కారకులగు ఆదిత్యాదులుఈ వ్యాధిని శాంతింప చేయుదురుగాక. అపస్మారాది రోగ కారకములనుపిశాచాదులు పారి పోవునుగాక. క్షేత్రీయ వ్యాధులఇషధులు సహితముఈ వ్యాధులను దూరముచేయును గాక.

వ్యాఖ్య- కొన్ని వ్యాధులునిర్మూలము కానిం ఉన్నట్లున్నం.అం నేడు ఉన్నం. ఉషస్సులుచీకట్లను తరుమును.నిర్మూలించలేదు.చీకట్లు మరలవచ్చినట్లుక్షేత్రీయ వ్యాధులుమరల మరల వచ్చుననిచెప్పుచున్నట్లున్నాడు.నేను మధుమేహము,రక్తపు పోటు మున్నగువానికి నివారణ తప్పనిర్మూలన లేకున్నది.

అనువంశికవ్యాధులకు ఇదితప్పనట్లున్నది!

3. కపిలవర్ణ అర్జున కర్ర, యవలపొట్టు, తిల సహితమంజరితో చేసినమణి వ్యాధినిదూరము చేయునుగాక. క్షేత్రీయ వ్యాధులఒషధుల సహితముఈ వ్యాధులను దూరముచేయును గాక.

4. రోగశాంతికలిగించు ఎద్దులుకట్టిన నాగలికినమస్కారము. కాడికి,కర్రుకు నమస్కారము.క్షేత్రీయ వ్యాధులఒషధులు సహితముఈ వ్యాధులను దూరముచేయును గాక.

5. తెరచిఉన్న గవాక్షములశూన్య గృహములకునమస్కారము. వధిలివేసిన పాత గుంతలకునమస్కారము. శూన్యగృహాది క్షేత్రపతికినమస్కారము. క్షేత్రీయవ్యాధుల ఓషధులసహితము ఈవ్యాధులను దూరముచేయును గాక.

## నాలుగవసూక్తము -9

ఃనియోగము:-

1) మోదుగు,బూరుగు, నేరేడు, కంపిలాదులలోఒక దానిని పది ముక్కలుచేసి లక్క బంగారముతో మణిని చేసి,వానిని పెట్టి ఈ సూక్తముచేసంపాత, అభిమంత్రములుచేసి -బ్రహ్మగ్రహశాంతి కొరకు- కట్టవలెను.

2) దశబ్రాహ్మణ,బ్రహ్మ గ్రహములుపట్టిన వానిని ఈసూక్తము జపించుచుతాకవలెను.

1. దశవృక్షమణీ!ఇతనిని బ్రహ్మరాక్షసిబంధము నుండిఃడిపింపుము. అమావాస్యాదిపర్వము లందు పట్టినబ్రహ్మరాక్షసినుండి ఃడిపింపుము.గ్రహావేశమునమృత ప్రాయుడైనవానిని మరల బ్రతికింపుము.

2. గ్రహఃముక్తుడైన వాడుమరల ఈ లోకమునకువచ్చును గాక. అతడుబాంధువులతోకూడను గాక. తనసంతానమునకు తండ్రిఅగును గాక. తన సేవకులకుస్వాః అగును గాక.

ఇతడుపరము భాగ్యవంతుడుఅగును గాక.

వ్యాఖ్య:- మరణము వలనకోల్పోయిన సమస్తవాక్కులు మరల పొందవలెనని.

3. గ్రహఃముక్తుడు అంతకు ముందటివేదాధ్యయనాదులనుమరల గుర్తుకు తెచ్చుకొనునుగాక. తన నివాసములనుగుర్తించును గాక.

మణిబంధమా! వందలవైద్యులు, వేలమందులు చేయుపనిని నీవు చేసినావు?

4. మణీ!గ్రహబాధలునివారించు, గ్రహములనుతిరస్కరించునట్టినీ ప్రభావము దేవతలకుతెలియును. బ్రాహ్మణులుఓషధులు ఃత్రావరుణులుఅందరు భూఃఃదగల నీ శక్తిని ఎరింగి ఉన్నారు.

5. ఈమణి బంధనప్రక్రియను ఏర్పరచినవాడే వైద్యతముడుఅగుచున్నాడు. అతడేనీకు వైద్యము చేయునుగాక. అతడే నిన్నువైద్యము చేసిఆరోగ్యవంతుని చేయునుగాక.

## ఐదవ సూక్తము -10

ఃనియోగము :

ఇంతకు ముందు చెప్పిన క్షేత్రీయ వ్యాధుల శాంతికిగాను నాలుగు బాటల కూడలిలో నిండు కుండను ఈ సూక్తముచే సాంపాతి అభిమంత్రణలు చేసి 'కంపిల' చెక్క కట్టి, నెమలి ఈకల కట్టతో స్నానము చేయించి, చల్లవలెను.

1. వ్యాధిగ్రస్తా! నిన్ను క్షేత్రీయ వ్యాధుల నుండి, మృత్యు పరిష్వంగము నుంచి, రక్తసంబంధీకుల ద్రోహముల నుండి, వరుణ పాశముల నుండి ముక్తుని చేయుచున్నాను.

" అనాగసం బ్రహ్మణా త్వాకృణోమి శివేతే ద్యావాపృథివీ ఉభేస్తాం " - మంత్ర మహిమతోనే నిన్ను అపరాధ రహితము చేయుచున్నాను. ద్యావాపృథ్వులు రెండును నీకు శివములు అగును గాక.

వ్యాఖ్య - " న తత్ సర్వం మత్సామర్థ్యే కరోమి. అపితు మన్త్ర ప్రభావేనేతి తాత్పర్యః" అని

సాయణాచార్యులు. ఇవన్నియు నా సామర్థ్యమున కాక మంత్ర ప్రభావమున చేయుచున్నాను అని తాత్పర్యము.

తన సామర్థ్యము, ప్రభావము అనుకొన్నవాడు గర్వపు రెక్కలు మొలిపించు కొనును. మరింత అధ్యయనము, పరిశోధన చేయడు. మంత్ర ప్రభావమో, భగవదనుగ్రహమో అనుకున్న వినయ వంతుడగును. మరిన్ని నేర్చుకొనుటకు ప్రయత్నించును.

2. వ్యాధి పీడితా! చతష్పథమున హూయ మానమగు అగ్ని అభిమంత్రిత జలాభిమాని దేవతలతో కూడి నీకు సుఖదాయకమగును గాక. సోమ ప్రభువు ఔషధ సహితుడై నీకు సుఖములు కలిగించును గాక.

" ఏవాహం త్వాం క్షేత్రియాన్నిరుత్యా జామి శంసాద్ద్రుహో ముంచామి వరుణస్య పాశాత్.

అట్లనుచున్న నేను నిన్ను క్షేత్రీయ వ్యాధులనుండి, మృత్యుపరిష్వంగము నుండి, రక్తసంబంధీకుల ద్రోహము నుండి, వరుణ పాశముల నుండి ముక్తుని చేయుచున్నాను.

"అనాగసం బ్రహ్మణా త్వా కృణోమి శివేతే ద్యావాపృథివీ ఉభేస్తామ్"

3. అంతరిక్షమున పక్షులను ధరించు వాయువు నీకు సుఖకరము అగును గాక. సమస్త దిశలు నీకు శుభములు కలిగించును గాక.

"ఏవాహం త్వాం క్షేత్రియాన్నిరుత్యా జామి శంసాద్ద్రుహో ముంచామి వరుణస్య పాశాత్.

అనాగసం బ్రహ్మణా త్వాకృణోమి శివేతే ద్వావాపృథివీ ఉభేస్తాత్".

4. వాయు పత్నులగు దేవేరులు, వారిని సకల దిశల నుండి వీక్షించు సూర్యుడు, సమస్త దిశులు నీకు శుభములు కలిగించును గాక.

"ఏవాహం త్వాం క్షే త్రియాన్ని ర్రుత్యా జాఽ శంసాద్ద్రుహో ముంచాఽ వరుణస్య పాశాత్.

అనాగసం బ్రహ్మణా త్వా కృణోఽ శివేతే ద్యావాపృథిఽ ఉబేస్తమ్".

5. ఆ దిశలందు నిన్ను వార్థక్య పర్యంతము నిలుపుచున్నాను. నీకు రోగములు కలిగించు పాప దేవతకు పరాజయము కలుగును గాక.

"ఏవాహం త్వాం క్షే త్రియాన్ని ర్రుత్యా జాఽ శంసాద్ద్రుహో ముంచాఽ వరుణస్య పాశాత్ ।

అనాగసం బ్రహ్మణా త్వా కృణోఽ శివేతే

ద్యావాపృథిఽ ఉభేస్తామ్ ॥"

6. నీవు యక్ష్మ నుంచి ఽముక్తుడవు అగుచున్నావు. దుర్గతి నుండి ఽముక్తుడవు అగుచున్నావు. ద్రోహముల నుండి, పాశముల నుండి, గ్రహ బాధల నుండి ఽముక్తుడవు అగుచున్నావు.

"ఏవాహం త్వాం క్షే త్రియాన్ని ర్రుత్యా జాఽ శంసాద్ద్రుహో ముంచాఽ వరుణస్య పాశాత్ ।

అనాగసం బ్రహ్మణా త్వా కృణోఽ శివేతేద్యావాపృథిఽ ఉభేస్తామ్ ॥"

7. శత్రువుల వంటి రోగములను ఽడిచినావు. సుఖములని చేరుచున్నావు. ఈ సుకృతముల భూలోకమున శాంతి, సుఖములు కలవాడవగుము.

"ఏవాహం త్వాం క్షే త్రియాన్ని ర్రుత్యా జాఽ శంసాద్ద్రుహో ముంచాఽ వరుణస్య పాశాత్ ।

అనాగసం బ్రహ్మణా త్వా కృణోఽ శివేతే ద్యావాపృథిఽ ఉభేస్తామ్ ॥"

8. సత్య స్వరూపుడగు సూర్యుని గ్రహము నుండి ఽడిపించిన దేవతలు అతనిని పాపముల నుండి ఽముక్తుని చేసినారు.

"ఏవాహం త్వాం క్షే త్రియాన్ని ర్రుత్యా జాఽ శంసాద్ద్రుహో ముంచాఽ వరుణస్య పాశాత్ ।

అనాగసం బ్రహ్మణా త్వా కృణోఽ శివేతేద్యావాపృథిఽ ఉభేస్తామ్ ॥"

## మూడవ అనువాకము

## మొదటి సూక్తము - 11

ినియోగము :-

1) స్త్రీ, శూద్రరాజు, బ్రాహ్మణ కాపాలికుడు, అంత్యజుడు, శాకిని మున్నగు వారు చేయు అభిచారము నుండి రక్షణకు మరియు కృత్యను దూరము చేయుటకు

తిలక మణిని హోమాభిమంత్రణలు చేసి కట్టవలెను.

2) కృత్య పరిహరణమున దీనిని పఠించవలెను. కృత్యానిర్వారణార్థ శాంత్యుదకమున దీనిచే ఆవాపన చేయవలెను.

3) " కృత్యదూషణ ఏవచ । చాతనే మాతృనామచ అథ శాంతైః కృత్యా దూషణై శ్చాతనైః "

4.) రాజ్యము, బ్రహ్మ తేజస్సు లభిలషించు వాని కొరకు బార్హస్పత్య శాంతి చేయవలెను.

5. కృత్యాపరిహరణ కర్మమున మొదటి బుక్కుచే దర్వితో మూడు మారులు 'సారూపవత్సే నాపోదకేన' మథించి 'గుల్ఫ' ిఏద చల్లవలెను.

1. దూషించు వారికి దూషించు దానవగుము. హంతకులకు హంతకవగుము. వజ్రమునకు వజ్రమవగుము. "అధిక బలశాలి శత్రువును హతమార్చుము. సమాన బలశత్రువును అతిక్రింంచి సాగుము"

"ఆప్నుహి శ్రేయాంసమతి సమం క్రామ్".

2. మణీ! నీవు తిలక వృక్షముచే చేయబడిన దానవు. హతమార్చవచ్చిన 'కృత్య' ను తొలగించుదానవు.

"ఆప్నుహి శ్రేయాంసమతి సమం క్రామ్".

3. మమ్ము ద్వేషించు వారిని, మేము ద్వేషించు వారిని నాశనము చేయుము.

"ఆప్నుహి శ్రేయాంసమతి సమం క్రామ్".

4. మణీ! నీవు తెలిసిన దానవు. వర్చస్సు గల దానవు. మా దేహములను రక్షించుదానవు.

"ఆప్నుహి శ్రేయాంసమతి సమం క్రామ్".

5. శత్రువును ఏడిపించు దానవు, తేజస్వినిం, తపింప చేయుదానవు అగుచున్నావు.

"ఆప్నుహి శ్రేయాంసమతి సమం క్రామ్".

ినియోగము :-

1) అభిచార కర్మ దీక్ష కొరకు ఈ సూక్తముచే వెదురు బొంగును కొట్టవలెను.

2) శత్రు సంహారక కర్మమున దక్షిణ దిశగా పారిపోవు శత్రువు కాళ్లకు అడ్డముగా ఆకులు వేయవలెను. వానిని ముక్కలు చేసి కాల్చవలెను.

1. ద్యులోకము, భూలోకము, ిశాల అంతరిక్షము, అద్భుతులు స్తోత్రవ్యులగు లోకపాలురు, అంతరిక్షమందలి మరుత్తులు, అగుపించని వాయువు నన్ను తపించు చేయువానిని తపింపచేయుదురు గాక.

2. యజ్ఞయోగ్యులగు దేవతలారా! భరద్వాజుడు నాకు ఫలసిద్ధి కలిగించుటకు చదువుచున్న మంత్రములను ఆలకించండి. మమ్ము బాధల పాశములతో బంధించిన వారు, మా మనసులను హింసించిన వారు మృత్యువుకు గురి అగుదురు గాక.

3. సోమపానము చేయు ఇంద్రదేవా! హృదయ క్షోభ కలవాడనై నిన్ను మరల మరల పిలుచుచున్నాను. నాకేకలు ినుము. మా మనసునకు కష్టము కలిగించు వానిని - చెట్టును రంపముతో వలె - కోసి వేయుదును.

4. త్రిసంఖ్యాక ఋక్కులు, సామగాయకులు, ఆదిత్యులు, అంగిరసులు, మా పితరులు సంతోషపరచుటకు చేసిన కార్యములు మమ్ము శత్రువుల నుండి రక్షించును గాక.

(త్రిసంఖ్యాక ఋక్కులనగా ఐతరేయ మహా వ్రత క్రతువున బృహదుక్థమందు సమామ్నాయము అని సాయణాచార్యులు.)

5. నేను శత్రువును జయించుటకు సిద్ధమగుచున్నాను. ద్యావాపృథ్వులారా! ిశ్వే దేవతలారా! సోమపానము చేయు అంగిరులారా! పితరులారా! ీరు కూడ ఉద్యిించండి. మాకు వ్యతిరేకముగ పనిచేయు శత్రువును మృత్యువు కబళించును గాక.

6. మరుత్తులారా! మమ్ము అణచివేయ దలచు వానిని, మా మంత్రానుష్టానమును నిందించు వారిని కాల్చివేయండి. మంత్ర ద్వేషులను ఆదిత్యుడు సకల దిశలందు దహించును గాక.

7. శత్రువా! నీ ఏడు ప్రాణములను, ఎనిిది నాడులను, ఇతర ప్రముఖ అవయవములను ఛేదించుచున్నాను. ఇప్పుడు నీవు శవము అయినావు కదా! అగ్ని దూతవగుము. యమపురికి చేరుము.

8. శత్రువా! ఛిన్నాభిన్న మైన నీ దేహమును మండుచున్న అగ్నిలో వేయుచున్నాను. అగ్ని నీ అవయవములను, వాక్కును, ప్రాణములను దహించును గాక.

## మూడవ సూక్తము - 13

ినియోగము :-

1) గోదానమున శాంత్యుదకమున అను యోజనము చేయవలెను. దీనితోనే ఘృతాహుతులిచ్చి బ్రహ్మచారి తలపైకి "సంపాతములు" తేవలెను.

2) 2,3 ఋక్కులచే కొత్త వస్త్రము ఇవ్వవలెను. ీనితోనే పురోహితుడు ప్రతిరోజు ఉదయము వస్త్రములను అభిమంత్రించి రాజుకు ఇవ్వవలెను.

3) నాలుగవ మంత్రముచే కుడి కాలును రాతి ీద పెట్టించవలెను. రాజుకు హారతి ఇచ్చునపుడు 4 వ మంత్రమున నాలుగు ఇసుక రేణువులను నాలుగు వైపులు వేసి ఒకదానిని రాజు ీద వేయవలెను.

4. 5వ మంత్రముచే మొదట పెట్టిన వస్త్రమును కర్త గ్రహించవలెను.

1. దేవతలారా! ఈ బాలకునకు వస్త్రము ధరించేయండి. అతనిని తేజస్విని చేయండి.

వార్ధక్యము వరకు బ్రతికించండి. దీర్ఘాయువు ప్రసాదించండి. బృహస్పతి సోమరాజునకు ఈ వస్త్రము ధరించుటకుగాను ఇచ్చినాడు.

2. బాలకా! నీవు ఈ వస్త్రమును నీ క్షేమము కొరకు ధరించుము. గోవులను హింసించకుము. రక్షించుము. పాలించుము. ' శతం జీవ శరదః ' - నూరేండ్లు జీంచుము. నీకు ధనపుష్టియు, సమృద్ధియు కలుగును గాక. పుత్ర, పౌత్రాదులచే వర్ధిల్లుము.

వ్యాఖ్య - పూర్వ కాలమున మానవులు తమ శరీరములను ఆచ్ఛాదించు కొనుటకు దేవతలు గోవు చర్మమున ప్రసాదించినారు. ఇప్పుడు వారు వస్త్రములను ఇచ్చినారు. బట్ట కట్టక ఎవరును గోవు వద్దకు పోరాదు. ఏలనన నగ్నముగా వచ్చువాడు తన చర్మమును తీయునేమో అని గోవు భయపడును. అందుకే బట్టకట్టిన బాలుడు గోవులను హింసించకుండ రక్షించమనుచున్నాడు.

మొదట మానవుడు చర్మములనే కట్టినాడు. శివస్వాి పులిచర్మము కట్టినవాడు కదా! అందువలన జంతుహింస పెరిగి పాడి, పశువులు తరిగినట్లున్ని. అప్పుడు మనిషి వస్త్రమును కనిపెట్టినాడు. హింసను, జంతుహింసను మాన్పించినట్లున్నాడు. ఈ మంత్రము మానవజాతి

చరిత్రపు ఆ దశను ివరించుచున్నది.

4. బాలకా! రమ్ము. కుడికాలు పెట్టి ఈ రాతిని ఎక్కుము. నీ దేహము రాతివలె గట్టిదై రోగరహితము అగును గాక. కృణ్వన్తు ిశ్వేదేవా ఆయుష్టే శరదః శతమ్ - ిశ్వేదేవతలు నూరు శరత్తుల ఆయుష్మంతుని చేయుదురు గాక.

5. బాలకా! నీవు ధరించి పరిహరించిన వస్త్రమును మేము తీసికొనుచున్నాము. సమస్త దేవతలు నిన్ను రక్షించెదరు గాక. నీవు సమృద్ధి కలిగి శోభిల్లుదువు గాక. పశు, పుత్ర, ధనములచే వర్ధిల్లుదువు గాక, నీవెన్ను దన్ని అనేకమంది సోదరులు జన్మించెదరు గాక.

## నాలుగవసూక్తము - 14

ౕవినియోగము:-

1) బిడ్డపోయిన తల్లి సంతాననాశకమును దూరముచేయుటకు మూడుమండపములందుఉదక పాత్రలనుఉంచవలెను.జలమును, సీసమునుసంపాతము చేయవలెను.ఆ సీసము ౕుద ఆ తల్లినికూర్చుండపెట్టి, ఆ జలముతోస్నానము చేయించవలెను.తదుపరి ఇంటికి తెచ్చిశాంత్యుదకమునఅభిషేకము చేయించి,పురోడాశపు ముద్దనుఅలంకారమును అభిమంత్రించిఇవ్వవలెను. లేకఒకే మండపమున ఆమెచేఔదుంబర సౕుధలుపెట్టించి ముందుచెప్పినట్లుశాంత్యుదక స్నానాదులుచేయించవలెను.

2) గొడ్డుబోతుఆవు ఉన్న ఇల్లు దైవోపహతమనబడును. దోష నివారణార్థముఆ వంధ్య గోవుతోనేయాగము చేయవలెను.ఆ యాగమున ఈ సూక్తముచేపర్యాగ్నికరణము చేయవలెను.

3) క్రవ్యాదులుచేరి, అగ్నిరహితమగుఇంటి శాలాప్రోక్షణమునఇది ౕవినియోగము.

4) చాతన,మాతృనామక గణములందుౕవినియోగము.

1. నిఃసాల మనునదిసంతానమును ్ౕరంగునది.సాలవృక్షమంతటిది.ఘర్షించునది. భయపెట్టునది- దానిని అభిభౕంచు'ధిషణ' రాక్షసిని - ఒకే కఠోరవాక్యము ఉచ్చరించు'ఏకవాద్య' ను భక్షించుస్వభావము గలరాక్షసిని నాశనము చేయుచున్నాము.'చండీ' నామక పాపగ్రహమును,దుఃఖము కలిగించుపిశాచినులను ధ్వంసముచేయుచున్నాము.

2. మగున్దాదుహితారో! ౕమ్ముగోశాల నుండి తరిౕవేయుచున్నాము.జూదగృహమునుండి వెళ్లగొట్టుచున్నాము.ధాన్యాగారము, శకటశాలనుండి పంపించివేయుచున్నాము.నివాస గృహములనుంచి దొబ్బివేయుచున్నాము.అంతేకాదు ౕమ్ములనుపూర్తిగా ధ్వంసము చేయుచున్నాము.

3. ఇదిభూలోకము. దీనికిదూరమున మరొక లోకమున్నది.దీని క్రింత పాతాళలోకము ఉన్నది.

పుణ్యకార్యములకు ౕఘ్నములుకలిగించునట్టియు,అలక్ష్మీ రూపమగు 'అదాయి'రాక్షసి ఈ లోకము ౕడిచిపాతాళము చేరునుగాక. 'సేది' నామ రాక్షసియు,సమస్త పిశాచములునుపాతాళమునకు చేరుదురుగాక.

4. భూతపతిరుద్రుడు పిశాచములనుమా ఇంటినుండితరుమును గాక. ఇంద్రుడుసహితము వానినివెళ్లగొట్టునుగాక. మా ఇంటి అడుగునఉన్న పిశాచములనుఇంద్రుడు తనవజ్రముచేతిరిగి లేవకుండఅణచివేయునుగాక.

5. పిశాచములారా!ీరు వంశానుక్రమ రోగకారకులైనను,శత్రుప్రేరితులైనను,ఏ ిధముగా చేరినవారైననునశించండి.

6. పిశాచములారా!అశ్వము లక్ష్యము చేరి,ఆక్రమణ పూర్తి చేసినిలిచినట్లునేను ీ నివాసములనన్నింటిని నలువైపులనుంచి జయించినిలిచినాను. ీ సమస్తరణములను గెలిచినాను.ీ స్థానములనుఆక్రించినాను. కావునీరు నిరాశ్రయులైనారు.నశించండి.

## ఐదవసూక్తము - 15

ినియోగము:-

ఆయుష్కాఈ సూక్తముచే స్థాళీపాకఅన్నమును శాంతిజలముచేప్రోక్షించి అభిమంత్రించిభుజించవలెను.

1. ద్యులోకము,భూలోకము ఒకరికిభయపడరు. నాశనముచేసికొనరు. అట్లేనా ప్రాణములు భయపడకుండునుగాక.

వ్యాఖ్య- దేహము,ప్రాణము భూలోకద్యులోకము వలెపరస్పర ఆశ్రితలు. అందువలనఒకరికి

ఒకరుకలసి ఉన్నంత కాలముభయపడవలసినపనిలేదు.

2. రాత్రింబవళ్లుఒకరికి ఒకరు భయపడరు.నాశనము చేసికొనరు.

"ఏవామే ప్రాణ మా బిభేః"అట్లే

నాప్రాణము భయపడకుండునుగాక.

3. సూర్యచంద్రులుఒకరికి ఒకరు భయపడరు.నాశనము చేసికొనరు.

"ఏవామే ప్రాణ మా బిభేః"

4. యథాసత్యం చానృతంచనబిభీతో నరిష్యతః ।

ఏవామే ప్రాణ మా బిభేః॥

5. యథాభూతంచ భవ్యంచనబిభీతో నరిష్యతః

ఏవామే ప్రాణ మా బిభేః।।

వ్యాఖ్యా- ప్రాణము భయపడదుఅని మాత్రమే అన్నాడు.'నరిష్యత' అనలేదనిగమనించవలెను.ఉపమానములు అందముగాఉన్నవి.

## ఆరవసూక్తము - 16

వినియోగము:-

1) ఆయుష్కామి.1. ఘృతము 2. సమిధ.3. పురోడాశము. 4. పాలు 5. అన్నము.

6. పాయసము.7. పశువు. 8. ధాన్యము.9. యవలు 10. తిలలు.11.పేలాలు. 12. పూరీలు వీనితోహోమము చేయవలెను.

2) రెండవమంత్రముచేబ్రహ్మయనుఋత్విజుడుఆగ్రాయణేష్టి యందుద్యావాపృథ్విని హవిచేఅనుమంత్రణముచేయవలెను.

1. ప్రాణాపానములారా!నన్ను మృత్యువునుంచి రక్షించండి- స్వాహా .

2. ద్యావాపృథ్యులారా!నాకు శ్రవణ శక్తి కలిగించికాపాడండి - స్వాహా.

3. సూర్యదేవా!నాకు చూపునిచ్చి కాపాడుము- స్వాహా .

4. వైశ్వానరాగ్నీ!సకల దేవతలుఅధిష్ఠాతలైనఅవయవములుకలిగించి కాపాడుము-స్వాహా .

5. విశ్వంభరా!పరిపూర్ణ జఠరాగ్నిచేరక్షించుచు నన్నుకాపాడుము - స్వాహా.

## ఏడవసూక్తము - 17

1. నీవుఓజస్సువు. నాకు ఓజస్సుప్రసాదించుము - స్వాహా.

2. నీవుసహమవు. నాకుశత్రుదమనశక్తి ప్రసాదించుము- స్వాహా .

3. బలమసిబలంమేదాః - స్వాహా।।

4. ఆయురస్యాయుర్మేదాః- స్వాహా ।।

5. శ్రోత్రమసిశ్రోత్రం మేదాః - స్వాహా।।

6. చక్షురసిచక్షుర్మేదాః - స్వాహా।।

7. అగ్నీ!నీవు పాలకుడవు.ఆయువునకు భంగముకలించు వారినుండినన్ను కాపాడుము

-స్వాహా।

## నాలుగవఅనువాకము

## మొదటిసూక్తము-18

ంవినియోగము:

1) అభిచారకర్మమున 'శర' సంధానమునల్ల ధాన్యమగుయవల, తిలలుంత్తుటను ఆరంభించుట.

2) 3,4,5ఋక్కులు ఆరాయక్షణాదిచాతన గణమునచదువునం. కావునఆ గణము వచ్చినచోట దీని ంవినియోగము.

1. అగ్నీ!నీవు శత్రు సంహారకుడవు.నాకు శత్రునాశకమునుప్రసాదించుము - స్వాహా.

2. అగ్నీ!నీవు సపత్న సంహారకుడవు.నాకు సంహారకత్వముప్రసాదించుము - స్వాహా.

3. అగ్నీ!నీవు అరాయ నాశకుడవు.నాకు అరాయ సంహారకత్వముప్రసాదించుము. స్వాహా.

(అరాయాఃఅదాయినః దానోపలక్షితనిఖిల శ్రేయో ంఘ్నకారిణఃఅని సాయణ వ్యాఖ్య.

అరాయలుదానము చేయనివారు. దానము మున్నగుమంగళకార్యములకుంఘ్నము కల్గించువారు.)

4.పిశాచ క్షయణమసిపిశాచ చాతనం మేదాః- స్వాహా.

5.సదాన్వా క్షయణమసిసదాన్వాచాతనం మేదాః- స్వాహా ॥

(ఆక్రోశకారిణ్యఃపిశాచాః. అని సాయణుడు.)

## రెండవసూక్తము - 19

ంవినియోగము:-ఇది మొదలు 5 సూక్తములచేఅభిచార కర్మమునతొలి హోమముచేయవలెను.

1. అగ్నీ!నీకు దహించుశక్తి ఉన్నది. దానితోకాల్చుము - " యోంస్మాన్ ద్వేష్టియం వయం ద్విష్మః" - మమ్ము ద్వేషించువారిని, మేము ద్వేషించువారిని.

2. అగ్నీ!నీకు సంహరించుశక్తి ఉన్నది. దానితోసంహరించుము-

" యోఽస్మాన్ ద్వేష్టియం వయం ద్విష్మః"

3. అగ్నీ!నీవు దీప్తివంతుడవు.దానితో సంహరించుము-

" యోఽస్మాన్ ద్వేష్టియం వయం ద్విష్మః"

4. అగ్నీ!నీవు ఏడిపించగలవాడవు.ఏడిపించుము -

" యోఽస్మాన్ ద్వేష్టియం వయం ద్విష్మః"

5. అగ్నీ!నీవు తేజస్సు గలవాడవు. నిస్తేజులనుచేయుము -

" యోఽస్మాన్ ద్వేష్టియం వయం ద్విష్మః"

## మూడవసూక్తముస - 20

1. వాయువా!నీకు దహించుశక్తి ఉన్నది. దానితోదహించుము-

" యోఽస్మాన్ ద్వేష్టియం వయం ద్విష్మః"

2. వాయువా!నీకు సంహరించుశక్తి ఉన్నది. దానితోసంహరించుము-

" యోఽస్మాన్ ద్వేష్టియం వయం ద్విష్మః"

3. వాయువా!నీవు దీప్తిమంతుడవు.దానితో సంహరించుము-

" యోఽస్మాన్ ద్వేష్టియం వయం ద్విష్మః"

4. వాయువా!నీవు ఏడిపించ గలవాడవు.ఏడిపించుము -

" యోఽస్మాన్ ద్వేష్టియం వయం ద్విష్మః"

5. వాయువా!నీవు తేజస్సు గలవాడవు.నిస్తేజులనుచేయుము -

" యోఽస్మాన్ ద్వేష్టియం వయం ద్విష్మః"

## నాలుగవసూక్తము - 21

(పైసూక్తము వలెనుసూర్యునకు అన్వయించునది.)

1.సూర్య యత్ తేతపస్తేన తం ప్రతితప. యో ఽస్మాన్ద్వేష్టి యం వయంద్విష్మః

2. సూర్యయత్ తే హరస్తేనతం ప్రతిహరయో ాస్మాన్ ద్వేష్టియం వయం ద్విష్మః

3. సూర్యయత్ తే తేర్చిస్తేనతం ప్రత్యర్చ యో ాస్మాన్ ద్వేష్టియం వయం ద్విష్మః

4. సూర్యయత్ తే శోచిస్తేనతం ప్రతిశోచ యో ాస్మాన్ ద్వేష్టియం వయం ద్విష్మః

5. సూర్యయత్ తే తేజస్తేనతమ తేజసంకృణుయో ాస్మాన్ ద్వేష్టియం వయం ద్విష్మః

## ఐదవ సూక్తము - 22

1. చన్ద్ర యత్ తే తపస్తేన తం ప్రతితప యో ాస్మాన్ ద్వేష్టి యం వయం ద్విష్మః

2. చన్ద్ర యత్ తే హరస్తేన తం ప్రతితప యో ాస్మాన్ ద్వేష్టి యం వయం ద్విష్మః

3. చన్ద్ర యత్ తే తేర్చిస్తేన తం ప్రత్యర్చ యో ాస్మాన్ ద్వేష్టి యం వయం ద్విష్మఃస

4. చన్ద్ర యత్ తే శోచిస్తేన తం ప్రతిశోచ యో ాస్మాన్ ద్వేష్టి యం వయం ద్విష్మః

5. చన్ద్ర యత్ తే తేజస్తేన తమతేజ సంకృణు యో ాస్మాన్ ద్వేష్టి యం వయం ద్విష్మః

## ఆరవ సూక్తము - 23

(అపః అనగా జలము. ఇది జలములది.)

1. ఆపో యద్ వస్తపస్తేన తం ప్రతి తపత యో ాస్మాన్ ద్వేష్టి యం వయం ద్విష్మః

2. ఆపో యద్ వో హరస్తేన తం ప్రతి హరత యో ాస్మాన్ ద్వేష్టి యం వయం ద్విష్మః

3. ఆపో యద్ వోర్చిస్తేన తం ప్రత్యర్చ యో ాస్మాన్ ద్వేష్టి యం వయం ద్విష్మః

4. ఆపో యద్ వః శోచిస్తేన తం ప్రతిశోచత యో ాస్మాన్ ద్వేష్టి యం వయం ద్విష్మః

5. ఆపో యద్ వస్తేజస్తేన తమ తేజసం కృణుత యో ాస్మాన్ ద్వేష్టి యం వయం ద్విష్మః

ానియోగము :-

1) అలక్ష్మి నాశక కర్మమున సముద్ర మధ్యమున 'శాపేటస్థ' అగ్ని యందు హోమము చేసి చరు సంపాతన అభిమంత్రణ చేసి భుజించవలెను.

2) యవల సత్తును ఎఱ్రమేక పాలలో వేసి ఘృతాహుతులు ఇచ్చి సాంపాతన, అభిమంత్రణము చేసి భుజించవలెను.

3. ఆ కర్మయందే తృణ గ్రంథలను చేసి నీరు నిండిన పాత్రలో మంత్రించి వేసి ఆ నీటితో ముఖము కడుగుట, స్నానము చేయవలెను.

1. శేరభక, శేరభా! మా ◌ీదకు తోలిన యాతనలను త్రిప్పి పంపండి. మాకు నష్టము కలిగించు ఆయుధములను, దొంగలు మున్నగు వారిని త్రిప్పిపంపండి.

" యస్య స్థతమత్త యోవః ప్రాహైత్ తమత్త స్వామాంసాన్యత్త " ◌ీరు ఎవరి వద్ద ఉన్నారో వానిని భక్షించండి. ఎవడు ◌ిమ్ము ప్రయోగించినాడో వాని తినండి. మా శత్రువుల మాంసములను తినండి.

(ఆశ్రయించిన వారికి సుఖములు కలిగించువాడు శేరభకుడు. యాతనలు కలిగించు వారలకు అధిపతి శేరభుడు.)

2. శేవృధక, శేవృధా! మా ◌ీదకు పంపిన యాతనలను త్రిప్పిపంపండి. మాకు నష్టము కలిగించు అయుధములను, దొంగలు మున్నగు వారిని త్రిప్పిపంపండి.

" యస్య స్థతమత్త యోవః ప్రాహైత్ తమత్త స్వామాంసాన్యత్త "

(శేవృధిక - ఆశ్రయించిన వారి సుఖములను పెంచువాడు. శేవృధ అలక్ష్మీకరులకు

అధిపతి.)

3. మ్రోక, మ్రోకాను మ్రోకులారా! మా ◌ీదకు పంపిన యాతనలను, మాకు హాని కలిగించు ఆయుధములను, చోరులు మున్నగు వారిని త్రిప్పిపంపండి.

" యస్య స్థతమత్త యోవః ప్రాహైత్ తమత్త స్వామాంసాన్యత్త "

(దొంగిలించి చాటుగా పారిపోవువాడు మ్రోకు వానిని అనుసరించువాడు అను మ్రోక.)

4. సర్పాను సర్పలారా! మా ◌ీదకు పంపిన యాతనలను, మాకు హాని కలిగించు ఆయుధములను, చోరులు మున్నగు వారిని త్రిప్పి పంపండి.

" యస్య స్థతమత్త యోవః ప్రాహైత్ తమత్త స్వామాంసాన్యత్త "

4. సర్పాను సర్పలారా! మా ◌ీదకు పంపిన యాతనలను, మాకు హాని కలిగించు ఆయుధములను, చోరులు మున్నగు వారిని త్రిప్పి పంపండి.

" యస్య స్థతమత్త యోవః ప్రాహైత్ తమత్త స్వామాంసాన్యత్త "

5. జీర్ణా! మా ◌ీదకు పంపిన యాతనలను, మాకు హాని కలిగించు ఆయుధములను, దొంగలు మున్నగు వారిని త్రిప్పిపంపండి.

" యస్య స్థతమత్త యోవః ప్రాహైత్ తమత్త స్వామాంసాన్యత్త "

6. క్రూర శబ్ద కారిణీ! మా ిందకు పంపిన యాతనలను, మాకు హాని కలిగించు ఆయుధములను, దొంగలు మున్నగు వారిని త్రిప్పి పంపండి.

" యస్య స్థతమత్త యోవః ప్రాహైత్ తమత్త స్వామాంసాన్యత్త "

7. అర్జునీ! మా ిందకు పంపిన యాతనలను, మాకు హాని కలిగించు ఆయుధములను, దొంగలు మున్నగు వానిని త్రిప్పి పంపుము.

" యస్య స్థతమత్త యోవః ప్రాహైత్ తమత్త స్వామాంసాన్యత్త "

(అర్జుని మద్ది చెట్టు వంటిది - మద్ది చెట్టు రంగు గలది. ఆ పేరు గల రాక్షసి.)

8. భరూజీ! మా ిందకు పంపిన యాతనలను, మాకు హాని కలిగించు ఆయుధములను, దొంగలు మున్నగు వారిని త్రిప్పి పంపుము.

" యస్య స్థతమత్త యోవః ప్రాహైత్ తమత్త స్వామాంసాన్యత్త "

(శరీరమునకు హాని కలిగించునది భరూజి.)

## ఎనిందవ సూక్తము - 25

ినియోగము :-

1) చాతన గణమున పఠించదగినది. శాంత్యుదకాదులందు కూడ ినియోగము.

2) కుష్ఠు మున్నగు వ్యాధులందు "పృశ్ని పర్ణి"ని నూరి పూత పూయవలెను.

1. దేి పృశ్నిపర్ణీ! మాకు సుఖములు కలిగించుము. రోగములు కలిగించు నిర్బతికి దుఃఖములు కలిగించుము. నీవు ఉగ్రరూపవు. పాపనాశినిి. రోగములను మాన్పుదానవు. నేను

నిన్ను తినుచున్నాను.

2. పృశ్నిపర్నీ! నీవు వ్యాధి నివారకమవు. ఓషధులన్నింటి కన్న ముందు పుట్టినదానవు. పక్షితల నరికిన రీతి నేను నీ బలమున రోగముల తలలు నరుకుచున్నాను.

3. పృశ్నిపర్ణీ! రక్తము త్రాగు రోగములను నాశనము చేయుము. వృద్ధిని నిరోధించు రోగములను నాశనము చేయుము. కడుపును తిను రోగములను, కడుపుకు హాని కలిగించు వానిని నాశనము చేయుము.

4. దేః పృశ్నిపర్ణీ! ప్రాణభయము కలిగించు రోగకారక పాపములను గుట్టఁదికి తీసుకొని పొమ్ము. సర్పములు, పశువులు మున్నగు వానిని భస్మము చేయు దావాగ్నిలో ఆ పాపములను భస్మము చేయుము.

5. పృశ్నిపర్ణీ! ప్రాణాపాయము కలిగించు రోగరూప పాపముల మెడలు వంచి పంపుము. సూర్యోదయమైనంత అంధకారము ఎచటికి చేరునో అట్టి ప్రదేశమునకు నీ ప్రభావమున ఆ పాపములను పంపుచున్నాను.

## తొఁమ్మదవ సూక్తము - 26

ఁనియోగము :-

1) గోవులకు పుష్టి కోరువాడు జున్నుపాలను ఈ సూక్తముచే సంపాతన అభిమంత్రణ

చేసి తినవలెను. అభిమంత్రించి గోవును ఇవ్వవలెను. ఈ సూక్తముచే జల

పూర్ణపాత్రను అభిమంత్రించి కొట్టము మధ్యన పెట్టవలెను.

2) ఒకే రూపు దూడగల ఆవుపాల అన్నమును గుగ్గిలము పిడకల నిప్పులో మూడు రాత్రులుంచి నాలుగవనాడు సంపాతన అభిమంత్రణలు చేసి భక్షించవలెను.

1. వెళ్లిపోయిన పశువులు గోష్ఠమునకు మరలి వచ్చును గాక. రక్షించుటకు గాను వాయువు

పశువులతో ఉంటున్నాడు. త్వష్ట కడుపులో ఉన్న దూడలకు నామ రూపములు కల్గించుచున్నాడు. అట్టి పశువులనన్నింటిని సఁతాదేవత గోష్ఠమున ఉంచును గాక.

2. గోవులు మున్నగు పశువులారా! మా గోష్ఠమునకు రండి. గోవులను తెచ్చు పరిజ్ఞానము గల బృహస్పతి పశువులను గోష్ఠమునకు చేర్చును గాక. 'సినీవాలి' పశువులను ఇచటికి తెచ్చును గాక. వానిని గోష్టమున ఉంచును గాక.

(" సినీవాలీ ఏతన్నాఁకా దేవపత్నీ దృష్టేందు కళామావాస్య దేవతావా" అని సాయణాచార్యులు. సినీవాలి పేరు గల దేవపత్ని లేక చంద్రకళ గల అమావాస్య.

'యా పూర్వా మావాస్యా సాసినీవాలి' అని గోపథము. అమావాస్యకు ముందుది సినీవాలి.)

3. పశువులు చేరును గాక. అశ్వములు చేరును గాక. సేవకులు ఎక్కువ మంది చేరుదురు

గాక. యవలు మున్నగు ధాన్యములు వృద్ధి చేరును గాక. అఁ సిద్ధించుటకు గాను నేను హఁస్సులు హోఁుంచుచున్నాను.

4. ఆవు యొక్క జున్ను పఆలను, నేతిని పారించుచున్నాను. బలమునిచ్చు రసమును ఘృతముతో కలుపుచున్నాను. మా పుత్ర, పౌత్రులు కూడ పాడి కలవారు అగుదురు గాక.

5. నేను నా ఇంటికి గోవులను తెచ్చుచున్నాను. పాలను తెచ్చుచున్నాను. ధాన్యమును, ధాన్యశక్తిని తెచ్చుచున్నాను. పత్నులను తెచ్చుచున్నాను. సంతానమును తెచ్చుచున్నాను.

(ఇం కొత్త సంసారము ఏర్పరచుట.)

## అయిదవ అనువాకము

ంనియోగము :-

1) ంవాదమున ంజయమునకు ఈ సూక్తము. దీనిచే 'పాఠామూలము' ను అభిమంత్రించి తినుచు అపరాజిత స్థానము నుండి సభాస్థానమునకు చేరవలెను. దానిని తినుచు ప్రతివాదిచే వాదించవలెను. ఆ 'వేరు' కొరకు హోమము చేసి దానిచే అభిమంత్రించి కట్టవలెను. ఏడు పాఠపత్రముల మాలను అభిమంత్రించి తలకు చుట్టుకొనవలెను. దీతితో అపరాజిత మహాశాంతి యందు 'పాఠమూల' మణిని బంధనము తలకు చుట్టుకొనవలెను.

1. పాఠఓషధీ! నేను నిన్ను సేంంచువాడను. ప్రతివాదియగు శత్రువు ఏనాటికి నన్ను జయించకుండును గాక. నీవు సహజముగానే శత్రువును ఓడించుదానవు కాదా! "ప్రతివాది గొంతును పూడ్చుము. అతనికి మాట పెకలకుందును గాక" ప్రాశం ప్రతిప్రాశో జహ్యరసాన్ కృణ్వోషధే"

2. ఓషధీ! గరుత్మంతుడు నిన్ను వెతికి వెలికి తీసినాడు. సూకరము నిన్ను భూంం నుండి సమూలముగ త్రంవ్వ తీసినది.

" ప్రాశం ప్రతిప్రాశో జహ్యరసాన్ కృణ్వోషధే "

3. ఓషధీ! అసురలను హతమార్చుటకు ఇంద్రుడు నిన్ను కుడిచేతికి కట్టుకుఅన్నాడు.

" ప్రాశం ప్రతిప్రాశో జహ్యరసాన్ కృణ్వోషధే "

4. ఇంద్రుడు అసురులను జయించుటకు పాఠమూలమును తిన్నాడు.

" ప్రాశం ప్రతిప్రాశో జహ్యరసాన్ కృణ్వోషధే "

5. ఓషధీ! ఇంద్రుడు నీ ప్రభావమున అడం కుక్కల వంటి అసురులను నిరుత్తరులను చూసినాడు. అట్లే నేను శత్రువులను నిరుత్తరులను చేయుదును.

" ప్రాశం ప్రతిప్రాశో జహ్యరసాన్ కృణ్వోషధే "

6. రుద్రదేవా! నీవు జలమును ఔషధము చేయగలవాడవు. నల్లని జటాజూటము కల వాడవు. కర్మముల చేయించువాడవు.

" ప్రాశం ప్రతిప్రాశో జహ్యరసాన్ కృణ్వోషధే "

7. ఇంద్రదేవా! ఎవడు తన యుక్తిచే ఓడించునో వాని ప్రతికూల ప్రశ్నలను పరిమార్చుము. నీవు నీశక్తిచే నన్ను ప్రతివాది ప్రశ్నలను తిప్పికొట్టు వానిని చేయుము.

## రెండవసూక్తము - 28

ంనియోగము:-

గోదానమందునచౌలకర్మముననుదీనిచే తలిదండ్రులుపుత్రుని మూడు మారులుఒకరు ఇంకొకరికి ఇవ్వవలెను.మూడు నేతి ముద్దలనుదీనిచే సంపాతన,అభిమంత్రణచేసి పుత్రునకుతినిపించవలెను.

1. అగ్నిదేవా!ఈ బాలుడు నిన్నుసేంంచువాడు. ఇతనినిఆరోగ్యముగా వర్ధిల్లచేయుము.

ఇతడురోగములు, మృత్యువుతాకక వార్ధక్యము వరకును,నూరేళ్లు జీంంచునుగాక. ంత్రదేవుడుతల్లివలెఇతని దగ్గర ఉండి రక్షించునుగాక. ంత్ర సంబంధమైనద్రోహ జనితపాపములు నుండి రక్షించునుగాక.

2. పగటిదేవత ంత్రుడురాత్రిదేవతవరుణుడు. రాత్రిదేవతవరుణుడు ఉభయులుఏకమనస్కులై ఈబాలకునకు వార్ధక్యమువరకు మృత్యువుకలుగకుండ చేయుదురుగాక.

అగ్నిహోత.సర్వజ్ఞుడు. అతడుంశ్వేదేవతలమూల స్థానమునకుచేరి ఈ బాలకునిదీర్ఘాయుష్కుని చేయునుగాక.

(అగ్నిసహితముగాసమస్త దేవతలుఈ బాలునకు దీర్ఘాయువుప్రసాదింతురు గాక అని.)

3. అగ్నిదేవా!నీవు పుట్టిన,పుట్టనున్న పశువులకుసాామ్రాట్టువు. ఈ బాలునిప్రాణములకు అపానములకుహాని కలిగించకుము.ంత్రులు గాని అంంత్రులుగాని ఇతనిని వధించుకుందురుగాక.

4. బాలకా!పితృరూప ద్యులోకము,మాతృరూప భూలోకముఏకమనస్కులై నీకువార్ధక్యము వరకు మృత్యువుకలిగించు కుందురు గాక.భూదేం వడిలోప్రాణాపానములతో" శతంహమాః" నూరు హేమంతములుజీంంతువు గాక.

వ్యాఖ్య- కొంతకాలము హేమంతముతోసంవత్సరము మొదలైనది.అందుకే " శతం హిమాః"

ఇప్పుడుగ్రిగేరియన్ సంవత్సరము హేమంతము.జనవరితో మొదలగుచున్నది.

కొంతకాలముసంవత్సరము శరత్కాలముతోమొదలైనది.అందుకే " శరదాం శతం"

ఇప్పుడుమన సంవత్సరమువసంతము. చైత్రముతో మొదలగుచున్నది.కాని ఇది వేదమునకనిపించదు. ఇది తరువాతఏర్పడి ఉండ వచ్చును.చిగుర్చు వసంతముతోకోరికలు చిగుర్చు ఉగాదివచ్చుట సహజముగ,శాస్త్రీయముగ తోచుచున్నది.

5. అగ్నిదేవా!ఈ బాలకునకు ఆయుష్యము,తేజస్సు కలిగించుము.ిత్రావరుణులారా!

ఇతనికిసంతానోత్పాదక శక్తిప్రసాదించండి. భూదేి!తల్లి వలెఇతనికి సుఖములుకలిగించుము. ిశ్వేదేవతలారా!వార్ధక్యము వరకు ఇతనినిసర్వసంపన్నుని చేయండి.

## మూడవసూక్తము - 29

ినియోగము:-

1) తృషార్తునిచికిత్సయందు. సూర్యోదయమునసూక్తమున చెప్పినట్లురోగిని కూర్చుండబెట్టిచిలికిన సత్తునీటిని అభిమంత్రించిత్రాగించవలెను.

2) నదినీటిని అభిమంత్రించితీసికొన వలెను.ఆరవ ఋక్కుచేరోగిని, నిరోగిని ఒకే ఆసనమునఆసీనులను చేసిఒకే బట్ట కట్టిచిలికిన నీటినిత్రాించవలెను.

3) గోదానము,చౌలకర్మమున 1,2 మంత్రములచేబాలకుని తలిదధాన్యము, యవలు,జమ్మిని అభిమంత్రించిపెట్టవలెను.

4) మూడవమంత్రముచేతృతీయ సవనము,పూత భృతములందు" ఆసిచ్యమాన "

' ఆశిర' అభిమంత్రణముచేయవలెను.

1. పృథ్వియొక్క రసము సేించువారికిభగదేవతదేహబలముప్రసాదించును గాక. అగ్నిఆయువును, సూర్య బృహస్పతులువర్చస్సును ప్రసాదింతురుగాక.

(పృథిియొక్క రసము అనగానియోగమున చెప్పినచిలికిన రసముఅని సాయణాచార్యుడు.)

2. జాతవేదఅగ్నీ! ఇతనికి ఆయువుప్రసాదించుము. త్వష్టా!నీవు పుత్ర, పౌత్రాదిఅధిక సంతానము నిమ్ము.సితాదేవా! నీవు ధన,సంపద సమృద్ధిని,శతశరత్తుల ఆయువునుకలిగించుము.

3. మాఆశలు ఫలించునుగాక. ద్యావాపృథ్వులారా! మాకుబలకరమగు అన్నముప్రసాదించండి. ఏకమనస్కులగుఁరు ధనము, దక్షతకలిగించండి.

ఇంద్రా!నీ అనుగ్రహమునఇతడు క్షేత్రములనుజయించును గాక. శత్రువులనుపరాజితులను చేయునుగాక.

4. ఇతడుతృషార్తుడు. ఇంద్రునివలన జీఁతమును,వరుణుని వలనబలమును, మరుత్తులప్రేరణ కలిగి మాలోకలసినాడు. ద్యావాపృథ్వులారా!ఇతనిని ఁ వడిలోపెట్టుకొని అన్నార్తునిదాహార్తుని కానీయండి.

5. బలవతులగుద్యావాపృథ్వులారా! ఈ తృషితునకుఁరు బలకర అన్నముకలిగించండి.

జలసంపన్న ద్యావాపృథ్వులారా!ఇతనికి జలముప్రసాదించండి. ద్యావాపృథ్వులారా!ఁరు ఇతనికి కోరిన అన్నము,బలము
ప్రసాదించినారు.ఁశ్వేదేవతలు,మరుద్గణములు,జలదేవతలుకూడ ఇతని యందుబలమును స్థాపించినారు.

6. తృషార్తా!నేను నీ సరస హృదయమునుసుఖప్రద జలముచేసంతృప్తుని చేయుచున్నాను.అప్పుడు తృషా రోగ రహితుడవగుదువు.నీవు తేజో సంపన్నుడవైఆనందించుము. ఒకేఆసమున ఉండి, ఒకే వస్త్రముధరించిన రోగి, మరియునిరోగీ! ఈ 'మంధ' యందుఅశ్వినుల వైద్యముఉన్నది. దీనిని త్రాగండి.

7. పూర్వముఇంద్రుడు వృత్రాదులనువధించి తృషితుడైనాడు.అప్పుడు అతడు ఈ పుష్టికర'మంథ' ను సృష్టించినాడు.అది బలకరము.ముసలి తనమునుతొలగించునది.

వ్యాధిగ్రస్తా!నీవు అట్టి మంథమునేసేఁంచినావు. అందువలనతేజో సంపన్నుడవగుము.

శతశరత్తులు జీఁంచుము.నీవు సేఁంచిన మథగుణమునీ దేహమునుఁడువకుండును గాక.అది నీకు బలముకలిగించును గాక. అదివైద్యులే నీ కొరకుఈ ఓషధి కల్పించినారు.

## నాలుగవసూక్తము - 30

ఁనియోగము:-

శ్రీవశీకరణము.చెట్టు బెరడు,శరఖండము, తగరము,అంజనము, కూడముమున్నగు ద్రవ్యములనునూరి నేతిలో కలిపిస్త్రీ యొక్క యోనికిపూయవలెను.

1. నేలఁది గడ్డినిగాలి కదిలించును.ఊపును. యువతీ!అట్లే నీ మనసునుకదిలించుచున్నాను.ఊపుచున్నాను. ఇక నీవునన్ను ప్రేఁంచుము.నన్ను ఁడువకుము.అన్యత్ర వెళ్లకుము.

2. అశ్వినులారా!నేను ప్రేించు దానినినావద్దకు చేర్చండి.ఆమెను నాకు కూర్చండి.ఁ ఉభయుల భాగ్యములునా యందు చేరునుగాక. ఁ మనసులు, వ్రతములునాలో ప్రవేశించునుగాక.

3. ఏసందేశమును చక్కనిరెక్కల పక్షులు వహించునో,దేనిని ఆరోగ్యవంతుడగుప్రేికుడు వెలిబుచ్చదలచునోఅట్టి నా సందేశముదేహములోనికిబాణము వలెనా ప్రియురాలి మనసునదూరును గాక.

4. మనసేదోమాట అదే. మాటఏదో మనసు అదే. అట్టిఅనాఘ్రాతలు, అందకత్తెలగుకన్యల నిర్మలమనసులను, ఓషధీ!నా వైపు మరలింపుము.

5. అశ్వముసకిలించుచు ఆడగుర్రమునుచేరును. అట్లేఆమె పతికాఁయై నన్నుచేరినది. నేనుభార్యకాఁనై, భాగ్యసహితముగాఆమెను చేరినాను.

వ్యాఖ్య- 'ప్రేమ'. ఆ పదమే కుసుమకోమలము. మధురము.మనోహరము.ప్రాణము! చాలునాఈ పదములు! ఇం ప్రేమకుసరిరాగలవా? ప్రేమ మనసిజము.అక్షరమున బందికాగలదా?

ప్రేమజగదాధారము. ప్రేమజీవనాధారము.ప్రేమ ప్రాణాధారము.ప్రేమ లేనిదిజగము లేదు.జీవము లేదు.ప్రాణము లేదు.ఏదీలేదు!

ప్రేమపరువముది మాత్రముకాదు. కాని పరువపు ప్రేమలోనే మురిపెము. యువతీయువకుల ఆరాటము.ఆవేదన. వలపుతలపు. ఇం ఎంత రమ్యములు!పరువమును వెనుకకుతెప్పించునం !!

యువతీయువకుల ప్రేమతపస్సులో కారణముఎరుగుము. ఆమె కఠినురాలు.ఉలకదు. పలుకదు.అందదు. అందకుండదు.అతడు తాళ జాలడు!ఆమెకు చేర జాలడు!!ఈ నిరీక్షణమే కావ్యము.

"కశ్చిత్కాంతాంరహగురుణా" అనికాళిదాసు మేఘసందేశముఒక ంరహార్తుని వేదన!

ఋగ్వేదమండలిఊర్వశీ ంక్రముల ప్రేమగాథవెన్నెలలోని కాళిదాసుఅమృత లేఖలో

"ంక్రమోర్వశీయము"గా అమరమైనది.

లైలామజ్నూ, షీరీఫర్హాద్ల ప్రేమ గాథలకుజరామరణములులేవు.

అనాదినుంచి కావ్యమునకుఆధారము ప్రేమయేగదా! ఆ రాణి ఇన్ని యుగాలుగాకఠినురాలేకదా!

"రాళ్ళు సైతముకన్నీరు రాల్చెగాని

నీవుకరుగవు. నా రాత నేమనందు?

ంరహమందునఎన్నెన్ని వేతలుకలిగె!

నిన్నుబాసియు జీంంచనేర్చు కొంటి" అన్నాను.

జాలిమ్!జరా ఆ దేఖ్ మేరేలాష్‌కొ

ఆంఖేఖులీహైతేరె ఇంతె జార్‌మె'జఫర్'

వెతలదాన! రా. చూడు నాశవాన్ని

కనులుతెరిచి ఉన్నం నీకొరకు వేచి.

ఈ సూక్తమున'ంనియోగము తప్ప"ంగిలినది తీయనివలపు జల్లు!

ప్రేమయేభక్తగును. మాతృభక్తి,దేశభక్తి, దైవభక్తితరణోపాయములగును.

"ఏయమగన్‌పతికామా జనికా మోహమాగమమ్

అశ్వఃకని క్రదద్ యథాభగేనాహమ్‌సహగమమ్" ఈ సూక్తముర ..... ఋక్కు.

## ఐదవసూక్తము -31

1) క్రింరోగశాంతికి నేయి కలసిననల్ల శనగలనుఆహుతి ఇవ్వవలెను.గోవాలముచే చుట్టిన'శరఖండము' నుభేదించి అగ్నిలోకాల్చి ఉంచవలెను.గొందిలోని దుమ్ముకుడిచేతిలోతీసికొని ఎడమ చేతిలోవేసుకొని దక్షిణ ముఖుడైఈ సూక్తమును జపించుచురోగి ంద వేయవలెను.రోగి దీనిని జపించుచుచేతితో ధూళికణములను రుద్దవలెను.

1. ఇంద్రునివద్ద ఒక మహాశిల ఉన్నది. అదిసమస్త క్రిములనునాశము చేయునది.నేను ఆ శిలలచేదేహమందలిక్రిములను శనగలనువలె పిండి చేయుదును.

2. దేహమునందున్నకంటికి కనిపించు, కనిపించనిక్రిములను నిర్మూలించుచున్నాను.వల వలెలోనవ్యాపించిన క్రిములనునాశము చేయుచున్నాను.రక్త మాంసమును జపించుచురోగి ంద వేయవలెను.రోగి దీనిని జపించుచుచేతితో ధూళికణములను రుద్దవలెను.

వ్యాఖ్య- సూక్ష్మజీవులు వ్యాధికారకములని ఆనాడేగ్రహించినట్లున్నారు- ఇది ఈ నాటి మాట

కాదు.వానిని వర్గీకరించి పేర్లుసహితము పెట్టినారు.

3. అల్గండు|క్రిములను మహాసాధనమున నశింపచేయుచున్నాను.అం తప్యములైనను,

అతప్యములైననునిర్జీవములైనం.|క్రిముల రకములలోమాడిన,
మాడనివాటినన్నింటినిమంత్రముచేనిశ్శేషము చేయుచున్నాను.

4. క్రిములుజీర్ణ కోశమున క్రమముగాచేరునని కలవు.తలలో, పక్కలందుఉండును. అధో ముఖముగసంచరించునం. ఎట్లైనదారి చేసుకొని దూరునంఉన్నం. కొన్ని
నాశనముచేయలేనిం.నేను వాటినన్నింటినిమంత్ర బలముననశింపచేయుచున్నాను.

5. పర్వతములందు,అరణ్యములందు,పశువులందున్నక్రిములను -
గాయములు,అన్నపానములుద్వారా లోన చేరిన- క్రిముల ఉత్పత్తినేనేను
ధ్వంసముచేయుచున్నాను.

## ఆరవఅనువాకము

## మొదటిసూక్తము - 32

ంనియోగము:-

గోవులక్రించికిత్స యందు,మూడు సంధ్యలందు,పుండు ంద దర్భలనుతాకించవలెను.

గతసూక్తమునందు వలెనేయి కలిపిన నల్లశనగలను హోమముచేయవలెను.

1. గోవులశరీరములందున్నక్రిములను ఉదయించుసూర్యుడు తన
వ్యాపకకిరణములచేధ్వంసము చేయునుగాక.

2. అనేకరకముల క్రిములనుచతురక్షులు, సారంగులు,అర్జునములనునాశనము
చేయుచున్నాను.క్రిముల పొట్టలను,క్రిముల చేరిచెరచిన
అవయవములనుచేదించుచున్నాను.

వ్యాఖ్య- ఇది శస్త్రచికిత్సమంచి అవయవమునురక్షించుటకు
చెడుఅవయవమునుతొలగించుట. ఇదినేటి ఆధునిక చికిత్సయందున్నది.

"అంగవ్రాతములో జిగిత్సకుడుదుష్టాంగంబు ఖండించేశే
షాంగశ్రేణికి రక్ష సేయు క్రియ"అని శ్రీమద్భాగవతముప్రహ్లాద చరిత్రమునచెప్పబడినది.

3.క్రిములారా! ంమ్ము అత్రి, కణ్వ, జమదగ్నులువధించుచున్నారు.అగస్త్యుని మంత్రశక్తిచే
ంరు మరలపుట్టకుండ చేయుచున్నాను.

4.మా మంత్రౌషధములచేక్రిముల రాజు,మంత్రి హతులైనారు.క్రిముల
తల్లి,తోబుట్టువులసహితముగాసమస్త క్రిం కుటుంబముహతమైనది.

(మాతా,భ్రాతా అన్నాడు. 'పితా' అనలేదు. క్రిములకుతండ్రి ఉండడు.వాటి ఉత్పత్తికి సంగమముఅక్కరలేదు.)

5.క్రిముల స్థానముధ్వంసమైనది. ఇరుగుపొరుగు స్థానములు ధ్వంసమైనవి.క్రిముల బీజముధ్వంసమైనది. సూక్ష్మాతిసూక్ష్మ క్రిములు ధ్వంసమైనవి.

6.కీటకమా! నీవు ఏ కొమ్ముతోబాధింతువో దానినివిరిచినాను. నీ 'శుకంభ'మను అవయవమునుత్రుంచినాను. నీలోన ఉన్న విషయముపిండినాను.

## రెండవసూక్తము - 33

వినియోగము:-

1)కన్ను, ముక్కు, చెవి,నాలుక, మెడ మున్నగుఅవయవములచికిత్స యందు.నొప్పులున్న కీళ్లనువదిలి రోగిపైద సంపాతితజలము చల్లవలెను.

2)ఈ సూక్త పాఠము ఆహోలింగగణములందు కలదు.సర్వరోగ చికిత్స యందువినియోగము.

3)అశ్వమేధ దీక్షలోఉన్న యజమానికిచికిత్స యందు.

1.యక్ష్మగ్రస్తా! నీ నేత్రములు,ముక్కు, చెవులు,చెబుకము నుండియక్ష్మను తొలగించుచున్నాను.తల, మెదడు,నాలుక నుండి కూడయక్ష్మను దూడముచేయుచున్నాను.

2.నీ మెడ, ఉష్ణిహనాడి,కికల, అనూక్యములనుండి, మాంసము నుండి,భుజములనుండి యక్ష్మనుతొలగించుచున్నాను.

3.హృదయము,క్లోమము, హలీక్షము,పార్శ్వములు, మాంసపిండములు,ప్లీహము, ఉదరమునుండి యక్ష్మనుతొలగించుచున్నాను.

4.అంత్రములు, గుదము,ఉదరము నుండి యక్ష్మనుతొలగించుచున్నాను.కుక్షినుండి, ప్లాశనాభినుండి యక్ష్మనుతొలగించుచున్నాను.

5.ఊరువుల నుండి, మూలుగునుండి, పాదములఅపర, అగ్రభాగములనుండి యక్ష్మనుకటి దిగువ భాగమునుంచి, గుహ్యప్రదేశ యక్ష్మనుగుహ్య స్థానమునుంచి తొలిగించుచున్నాను.

6.ఎముకల నుండి, మూలుగునుండి, ధాతువునుండి, సూక్ష్మ, స్థూలనాడుల నుంచి,వేళ్లనుంచి,గోళ్లనుంచి యక్ష్మనుతొలగించుచున్నాను.

7.రోగగ్రస్తా! అంగాంగములందు,రోమ రోమములందుచేరిన యక్ష్మనుతొలగించుచున్నాను.చర్మవ్యాధిని సహితముతొలగించుచున్నాను.ిటన్నింటిని కశ్యపుని“ివర్హ” మంత్ర ప్రభావమునచేయుచున్నాను.

వ్యాఖ్య- యక్ష్మ అనగా వ్యాధి.నేటి పాశ్చాత్యవైద్య ిధానమువ్యాధిని నివారించుచున్నది.నిర్మూలించుట లేదు.ఏ అవయవపు వ్యాధినిదాని నుండి తొలగించుచున్నది.WHOLISTIC-

పరిపూర్ణచికిత్స సాధ్యమగుటలేదు. వ్యాధిశరీరమంతటి నుండితొలగించుటనుగురించి ివరించినాడు.

శరీరనిర్మాణ ANOTOMYశాస్త్రమునాడు ఎంత ిపులముగాతెలిసికొన్నారో ిదితమగుచున్నది.నఖ, శిఖ - గోటినుండి తల - పర్యంతముసమస్త అవయవములనుపేర్కొన్నాడు. ిటి అన్నింటినుండి వ్యాధి తొలగినపుడేవ్యాధి నిర్మూలమగుట- రోగి ఆరోగ్యవంతుడగుట.

నేడుమనము దీనికి ఎంతదూరములో ఉన్నాము?

## మూడవసూక్తము - 34

ినియోగము:-

1)వశాశమన కర్మమునఘృతాహుతులకు.

2)సకల లోకాధిపత్యముకోరువాడు దీనిచేఇంద్రాగ్ని యాగము లేకఉపస్థానము చేయవలెను.

3)బ్రాహ్మణులకుఇష్టాన్నము ఇచ్చుటకు.

4)పశు యాగమున యూపమునుంచి సంజ్ఞాపనమునకుిడిచిన పశువునుఈ సూక్తముచే అనుమంత్రణముచేయవలెను.

5)5వ మంత్రముచేవశా పశువును సంజ్ఞాపనముచేయవలెను.

1.పశుపతి యగు రుద్రుడుపశుపోషకుడు, మానవులకుప్రభువు అగుచున్నాడు.ఆ పశుపతి వద్ద నుండిగ్రహించి, స్వాధీనపరచుకున్న పశాపశువుయజ్ఞభాగముఅగును గాక. యజమానికిధన ధాన్యములుకలిగించును గాక.

2.యాగము ప్రాణులఉత్పత్తి హేతువుఅగుచున్నది. కావునవధించుటకువదిలిన పశువును ండుచునట్టిచక్షురాది దేవతలారా!ఈ యజమాని పుణ్యలోకముచేరుటకు మార్గముచేయండి. మంత్రబలమున ఈ లోకమునకువెళ్లు మాంసముదేవతలకు భోగ్యమగునుగాక.

3.ఇది మధ్యపశువు.దీని మందలోనిఇతర పశువులు దీనినిమనసుతోను, కంటితోనుచూచుచున్న .అగ్నిదేవా! ఈ మధ్యపశువును ఆ చూపులనుండి డిపించుము.అ శ్వకర్మ సృష్టించినప్రజ కొరకు నిలుచునుగాక.

4.ఈ మధ్య పశువునకుగ్రామమున అన్య ధరూప, రూప పశువులసఖ్యత ఉన్నది.

వాయుదేవా!ఆ పశువుల స్నేహమును డిపించుము. అ శ్వకర్మసృష్టించిన ప్రజకొరకు ఈ లోకమున నిలుచునుగాక.

5.పశువా! నీ రాక కొరకు దేవతలుఆకాశమున వేచి ఉన్నారు.వారు నీ దేహమును డిచి వచ్చుప్రాణమును అనుగ్రహించి,గ్రహింతురు గాక.ఆలోకమున భోగములనుభ ంచుదేహముననిన్ను ప్రతిష్ఠింతురుగాక. దేవయాన మార్గముననిన్ను స్వర్గమునకుచేర్చెదరు గాక.

## నాలుగవసూక్తము - 35

నియోగము:-

1)అందరి మధ్యనభక్షించిన దృష్టిదోష నివారణార్థముఈ సూక్తముచే అన్నమునుఅభిమంత్రించిభుజించ వలెను.

2)సకల లోకాధిపత్యముకోరువాడు దీనిచేఇంద్రాగ్ని యాగము లేకఉపస్థానము చేయవలెను.

3)అన్ని సవయజ్ఞములందుదీనిచే పురస్తాద్హోమముచేయవలెను.

4.సాకమేధ కర్మమునఈ సూక్తముచే వైశ్వకర్మయాగఅనుమంత్రణముచేయవలెను.అగ్ని చయనపు వైశ్వకర్మణహోమానుమంత్రమున నియోగము.

5.దర్శపూర్ణ మాసపు పురస్తాద్హోమమునదీని నియోగము.

1.ధనమును యాగాదులకువ్యయించక అన్యములకువ్యయించువారికి సమృద్ధికలుగకున్నది. ఆ ధనముతనను యాగాదులకువ్యయించుమని లపించుచున్నది.మేము

అయజ్ఞము,దుర్యజ్ఞము చేసినవారలము అగుచున్నాము. శ్వకర్మ ఆ దోషములనునివారించును గాక.

2.యాగ వైకల్ప పాపములకుయజమాని సహితముగఋషియు బాధపడుచున్నాడు.అట్లయ్యు యజమానికిపాపము కలుగుచున్నది.ప్రజాపతి సోమబిందువులనుస్వాధీన పరచుకున్నాడు.ఆ బిందువులు ఈ యజ్ఞమునుపునీతము చేయునుగాక.

3.యుద్ధములందుసైనికుడు అన్యుని అల్పునిగాభాించును. అట్లేతానే యజ్ఞమునుఎరిగిన వాడనని ఇతడుగర్వించినాడు. ఇతర యాజ్ఞికులనుచులకన చేసిపాపము చేసినాడు.ిశ్వకర్మా! ఇతనిని ఈ పాప ిముక్తునిచేయుము. ఇతనికిశుభములు కలిగించుము.

4.ఋషులకు నమస్కారము.అంతః కరణమందుండిసత్యమును దర్శించుచక్షువునకు నమస్కారము.ద్యుమంతుడగుబృహస్పతికిమహా నమస్కారము.ిశ్వకర్మకు నమస్కారము.

పాహ్య%స్మాన్ . మమ్ముకాపాడుము.

5.ఇతడు యజ్ఞచక్షువు- యజ్ఞముఖముఅగుచున్నాడు. వాక్కుశ్రోత్రములు, మనసునుఏకాగ్రము చేసి ఇతనినిహోించుచున్నాను.ిశ్వకర్మ ఈ యజ్ఞమును,కల్పించి నిర్వహించుచున్నాడు.కావున సమస్త దేవతలుమంచి మనసుతోిచ్చేయుదురు గాక.

## ఐదవసూక్తము - 36

ినియోగము:-

1)కుమారికి పతి లభించుటకుఈ సూక్తముచే తిలాన్నమునుసంపాతించు తినిపించవలెను.

2)ఔక్షము, గుగ్గిలము,అలంకారములనుసంపాతించి కన్యనుకట్టి, పొగ వేసి, అలంకరించవలెను.

3)రాత్రిపూట ధాన్యమునుఈ సూక్తముచే ఆహుతిఇచ్చి కన్యను ప్రదక్షిణముచేయించవలెను.

4)సంపాతించిన నావపైద ఎక్కించి ఇందలి5వ మంత్రముచేదించవలెను.

5)ప్రతిలాభ ిజ్ఞానకర్మమున ఏడు 'దామంత్రు'లందు ఏడు దూడలనుకట్టి కన్యచే

ిడిపించవలెను. అి దక్షిణమునకుపోయిన పతిలాభమనితెలియ వలెను.

6)చిరగని బట్ట కట్టినఋషభమునుహోమము చేసిిడువ వలెను.

7)ివాహ కార్యమందుఈ సూక్తముచే 'ఆగమకృసరము'ను సంపాతన, అభిమంత్రణములుచేసి కన్యకు తినిపించవలెను.

1.అగ్నిదేవా! ఈ కన్యనుభాగ్య సహితముగావరించు వానిని మాకుచూపుము. అతడుసహృదయులగుతన బంధువులతోకూడి వచ్చునుగాక. వారు మెచ్చుదురుగాక. ఆమెకు పతి సౌభాగ్యముకలిగింతురు గాక.

2.ఈమె సోముని సేించినది.గంధర్వులను సేించినది.ఆర్యమ స్వీకరించినాడు.ఈ కన్య ఐశ్వర్యమునప్రసిద్ధురాలు. ధాతఅనుమతిన - దేవతకాని - మానవ పతినిఈమెకు కూర్చుచున్నాను.

3.ఈమె కన్య. పతిని చేరునుగాక, ప్రభువగు సోమదేవత ఈమెకు సౌభాగ్యముకలిగించును గాక. పతినిచేరును గాక. ప్రభువగుసోమ దేవతఈమెకు సౌభాగ్యముకలిగించును గాక. పతినిచేరి మంచి భార్యయైపుత్రులను కనునుగాక. అట్లు ఈమె సౌభాగ్యవతి,పరమ తేజస్వి అగునుగాక.

4.భోగ్య పదార్థములతోకూడిన ప్రదేశమున్మృగములకు ప్రియము,సుఖ ఆవాసము అయినట్లుఈమె పతి ప్రేమ కలిగిలాస వస్తువులనువర్థిల్ల చేయుచుభాగ్యవతి అగునుగాక.

5.కన్యా! భాగ్యప్రాప్తిసాధనము, అభిలశితప్రపూర్ణము, అక్షయమగునావను ఎక్కుము. ఈ నావలోఎక్కి కోరిన భర్తవద్దకు చేరుము.'ఇతడే నేను కోరినవాడు'అని అతనిని చేరుకొనుము.

6.ధనపతీ! వరునిచే'ఈ కన్య నా భార్య అగునుగాక' అని ఘోషింప చేయుము.వరుని

వధువుముందుకు చేర్చండి.వరుని మనసు వధువునుఆకర్షించునట్లుచేయుము. సమస్తప్రాణులను వాహమునకుఅనుకూలురను చేయండి.వరుడు అనుకూలుడుఅగును గాక.

7.అమ్మాయీ! ఇగో బంగారు నగలు.ఇదిగో ధూపము. ఇదిగోఔక్ష. టి అధిష్ఠానదేవత

భగుడు.నీవు నిని ధరించుము.సోమ, గంధర్వ, అగ్నులునిన్ను నీ పతికి ఇచ్చుచ్చున్నారు.

(ఔక్షము- చందనము, పాలు,నేయి, నీరు కలిపి దానినితేనెతో కలిపినఅలంకార ద్రవ్యము.)

8.కన్యా! సంతా దేవతనీవు వరించినవరుని తెచ్చునుగాక. నీ భర్త నిన్నుతన ఇంటికి తోడ్కొనిపోవును గాక.

ఓషధులారా!ఈమెకు కోరిన వరుని ప్రసాదించండి.

ద్వాంసుడు,బహుభాషావేత్త,క కథకుడు, నవలాకారుడు, నాటక రచయిత,బాల సాహిత్యకారుడు, మర్శకుడు, సినీరచయిత, వ్యాసకర్త,అనువాదకుడు, వక్త,స్వాతంత్ర్య సమరయోధుడు,ప్రగతి

పథగాం, ప్రపన్నుడగుదాశరథి రంగాచార్య రచించినశ్రీమదాంధ్ర వచనఅథర్వ వేద సంహితయందలి రెండవకాండ సమాప్తము.

యస్యనిఃశ్వసితం వేదా యోవేదేభ్యో %ఖిలంజగత్ ।
నిర్మమేతమహం వన్దేంద్యాతీర్థ మహేశ్వరమ్॥

## శ్రీమదాంధ్రవచన అథర్వ వేదసంహిత

## మూడవకాండ

## మొదటిఅనువాకము

## మొదటిసూక్తము -1

అగ్నిర్నఃశత్రూన్ ప్రత్యేతుంద్వాన్ ప్రతిహన్నభిశస్తి మరాతిమ్ ।

ససేనాం మోహయతుపరేషాం నిర్హస్తాంశ్చ కృణవజ్జాతవేదాః ॥

ంనియోగము:

పరసేనామోహన కర్మమునఫలీకరణ లేక కణికికకలిపిన అన్నపిండమునుసంగ్రామాగ్నియందుఉలూఖలముచేహోమము చేయుటయందు. ఈ కర్మమందే21 ఇసుక రేణువులనుశత్రు సేన వైపు చల్లవలెను.

అప్వాఖ్యదేవతకు దీనిచేచరు హోమముచేయవలెను.

1.అగ్ని మా శత్రువుంద పడును గాక. ంద్వాంసుడగుఅగ్ని మమ్ము ద్వేషించువారిని

దహించునుగాక. వారికి అభిముఖుడైసాగును గాక. జాతవేదాగ్నిశత్రుసేనను మోహింపచేయును గాక. శత్రుసేననుఅయుధము ఎత్తకుండచేయును గాక.

2.మరుత్తులారా! ంరుఉగ్రులు. ఈ భీషణసంగ్రామమున నాతోనిలువండి. శత్రువునువధించుటకువారికి ఎదురు వెళ్లండి.వసువులారా! మా ప్రార్థనంనండి. మా శత్రువులనుసంహరించండి.ంద్వాంసుడు, మరుత్తులదూతయగు అగ్ని కూడపరసేనల ంద పడునుగాక.

3.మఘువ ఇంద్రా! మాంత్ర సేనలనుశత్రువులనువధించుము.నీవు వృత్రహంతవుకదా! అగ్నితో కలసి శత్రుసేననుభస్మము చేయుము.

4.ఇంద్రదేవా! హర్యశ్వములరథము ంద పల్లపుమార్గమున వచ్చిశత్రుసేన ంద పడుము.అప్రతి హతమగునీ వజ్రము శత్రువులంద పడును గాక.

ముందునుంచి,వెనకనుంచి, పక్కలనుంచి పడు సేనలనుసంహరించుము.శత్రువు హననకార్యోద్యుక్తుడై ఉన్నాడు.అతని మనసును◌కలము చేయుము.

5.ఇంద్రా! అ◌ుత్ర సేనలనుమోహవశులనుచేయుము. వాయువు,అగ్ని కలిసినంత వేగముగల వంటి దాహమునశత్రు సేనలనుచుట్టు ముట్టిదహించుము.

6.ఇంద్రుడు శత్రుసేనలనుమోహ పరవశులనుచేయును గాక. మరుత్తులుబల ప్రయోగమునసేనను సంహరింతురుగాక. అగ్ని శత్రువులనేత్రములనుకాల్చును గాక. పరాజితశత్రుసేన మరలిపోవును గాక.

## రెండవసూక్తము - 2

◌నియోగము: పూర్వ సూక్తమువలె.

1.దూతయు, ◌ద్వాంసుడునుఅగు హింసక శత్రువులనువధించుచుముందునకు సాగునుగాక. అతడు శత్రుసేనలచిత్తములనుభ్ర◌ుంప చేయునుగాక. జాత వేదాగ్ని,శత్రువు ఆయుధముఎత్తకుండ చేయునుగాక.

2.అగ్ని దేవా! శత్రువులహృదయములందుమమ్ము అణచివేయవలెననుఆరాటమున్నది.దానిని మోహపరవశనుచేయుము. వారినివారి స్థానముల నుండితొలగించుము.

3.ఇంద్రా! శత్రువులచిత్తములనుమోహింప చేయుము.శత్రు సంహారమందునీ మనసును కేంద్రీకరించిశత్రుసేనల ముందునిలువుము. నీవువాయువుతో అగ్ని కలసినంతప్రచండ వేగవంతుడవగుము.శత్రువును పారద్రోలుము.ధ్వంసము చేయుము.

4.శత్రువు మనసులందు◌◌ధ ◌రుద్ధ సంకల్పములుకలుగును గాక. వారికి చిత్తభ్రమకలుగును గాక. శత్రువులమనసులందు యుద్ధమునకుఉద్య◌ుంచు ఆలోచనలుధ్వంసమగును గాక.

5.అప్వే! మా శత్రువులచిత్తములనుమోహింప చేయుము.వారి ప్రత్యంగమునప్రవేశించుము. మాశత్రువు ◌ంద పడుము.వారిని దహించుము.వారి హృదయములందుదుఃఖమును నింపుము.శత్రువును చీకటిలోపడవేసి వధించుము.

6.మరుత్తులారా! శత్రుసేనబలములు కూర్చుకొనిమా ◌ందకు వచ్చుచున్నది.◌ు వద్ద గల సకల◌ఘ్నకర శక్తులచేవారికి అంధకారము అగునట్లుచేయండి. ఈ శత్రువులనుఒకడు,

మరొకరినితెలియకుండునంతటిచీకటిన త్రోసివధించండి.

## మూడవసూక్తము - 3

ృనియోగము:-

1)శత్రువుచే తరింవేయ బడినరాజును తిరిగి రాజ్యప్రవేశము చేయించుట.

శత్రుసేనఆకారము గల పురోడాశమునునీళ్లలో దర్భలనుపరచి పెట్టవలెను.దాని ంద మట్టిపెడ్డ పెట్టి ముంచవలెను.క్షీరాన్నమును ఈ సూక్తముచేసంపాతన, అభిమంత్రణచేసి రాజునకుతినిపించ వలెను.

2)సాకమేధ కర్మమందుతొలినాటి ఆగ్నేయిఇష్టి యొక్క ప్రధానయాగాను మంత్రణమునృనియోగము.

1.అగ్నిదేవా! ఇతడురాజ్యభ్రష్టుడు.తిరిగి తన రాజ్యమునప్రవేశించుటకు నిన్నుపిలుచుచున్నాడు.ప్రార్థించుచున్నాడు.ఇతడు తన ప్రజనుపాలించునట్లుఅనుగ్రహింపుము.

ఇతనినిరక్షించుటకు నీవుద్యావా పృథ్వ్యలందుపరివ్యాప్తుడవగుము.మరుత్తులు నీకుసాయపడుదురు గాక. ఇతడునీకు నమస్కరించుచున్నాడు.హం అర్పించుచున్నాడు.ఇతనిని

తిరిగిఅతని రాజ్యమునప్రతిష్ఠించుము.

2.ఋత్విక్కులారా! దూరముగాస్వర్గమందున్న ఇంద్రునితోఈ రాజునకు స్నేహముకలిగించండి. దేవతలుఇంద్రుని గాయత్రి,బృహతి ఛందస్సులతోను,పూజనీయ సౌత్రామణి

చేతనుపరమ రుని చేసి ఉన్నారు.

3.పరాజిత రాజా! వరుణుడునిన్ను జలమునుంచి పిలుచునుగాక. సోమము పర్వతములనుండి పిలుచు గాక.ఇంద్రుడు నీ ప్రజనుండిపిలుచును గాక. అట్లువారిచే పిలువబడిడేగవలె నీ రాజ్యమునప్రవేశింపుము.

వ్యాఖ్య- 'దేశమంటే మట్టికాదోయ్ దేశమంటేమనుషులోయ్'అన్న గురజాడ భావముఇందు కనిపించినది.

జలమును,పర్వతమును, ప్రజలనుమాత్రమే దేవతలుముక్తము చేసినారు.నేలను కాదు. మట్టికన్న మనుషులుముఖ్య మనియేకదా!

రాజుతన ప్రజనుతీసికొని జలమున్నపర్వత ప్రాంతములకుచేరి పాలించినవాడనియుభావము కావచ్చును.

“శ్యేనో భూత్వా౦శ ”డేగవలె ప్రవేశించుటఒక వాయు యుద్ధపద్ధతి.పదాతులను అతిక్ర౦ంచి౦మానములేఆక్ర౦ంచుట. ఈ పద్ధతినిరెండవ ప్రపంచ యుద్ధమందున,బంగ్లాదేశ ౦ముక్తిసమర మందును అనుసరించినారు.

4.ప్రశంసనీయ వేగవంతులగుదేవతలు పరులుఆక్ర౦ంచిన రాజ్యమందుఈ రాజును ప్రవేశపెట్టుదురుగాక.

అశ్వినులుమార్గములనుసుగమములు చేయుదురుగాక. ప్రజలు ఈ రాజునుసే౦ంతురు గాక.

5.రాజా! నీకు ప్రతికూలురగుప్రజ అనుకూలురై నీకుసహకరింతురు గాక.నీకు ప్రతికూలురైన౦ంత్రులు అనుకూలురైస్నేహమునవర్తింతురు గాక. ఇంద్రుడు,అగ్ని, ౦శ్వేదేవతలునీకు ప్రజలనురక్షించు శక్తి కలిగింతురుగాక.

6.రాజా! నీవు నీ రాజ్యమునపునః ప్రవేశము చేసినపుడునీతో సమాన బలవంతులును,తక్కువ బలవంతులునునీకు స్వాగతము పలుకుదురుగాక.

ఇంద్రదేవా!ఈ రాజ్యము నుండిసర్వ ౦ధ శత్రువులనుబహిష్కరించిఈ రాజును రాజ్యమునప్రసిద్ధుని చేయుము.

## నాలుగవసూక్తము - 4

౦నియోగము:- మూడవ సూక్తమువలెనే.

2)ప్రయా ణేష్టి యొక్కపథ్యాస్వస్తి యాగాను మంత్రణమునఏడవ మంత్రము౦నియోగము.

1.రాజా! శత్రువులుఆక్ర౦ంచిన నీ రాజ్యమునీకు సంక్ర౦ంచినది.బలవంతుడవు,

ప్రసిద్ధుడవుఅగుము. మరల ప్రజాపాలకుడవై, శత్రురహితరాజ్యమున తేజరిల్లుము.నాలుగు దిక్కులు,వాటి అధిష్ఠానదేవతలు, సకలదిశల ప్రజలునిన్ను ప్రభువుగాస్వీకరింతురు గాక. నీ రాజ్యమందలిసకల ప్రజ నీకు నమస్కరించి,నిన్ను సే౦ంతురు గాక.

2.రాజా! ప్రజలు నిన్నేప్రభువుగా కోరుకుందురుగాక. మధ్య దిశ సహితముగాఅయిదు దిశలు నిన్నుసే౦ంచును గాక. తదుపరినేలకు నూపురమువంటి సింహాసనమునఆసీనుడవగుము. ప్రచండబలశాలి౦ అగుము.సేవకులకు ధనముఅందించుము.

3.రాజా! నీతో సమానులగురాజులు నీ ఆజ్ఞనుతలదాల్తురు గాక.నీ దూతలు అగ్ని వలెసర్వత్ర అప్రతిహతులైసంచరింతురు గాక. నీ భార్యాపుత్రులు సంతోషింతురుగాక. నీవు మహాబలవంతుడవైనీ ముందున్న కానుకలను౦క్షింపుము.

4.రాజా! అశ్వినులు, ుత్రావరుణులు,మరుద్గణములునిన్ను రాజ్య ప్రవేశముచేయింతురు గాక. తదుపరినీ మనసు దానములిచ్చుటందులగ్నము చేయుము.నీవు ఉగ్రుడవై సందలనుఅనుభంపుము.

5.దూర దేశమునఉన్నరాజా! శీఘ్రముగరమ్ము. ద్యావాపృథ్వులునీకు శుభములుకలిగించును గాక. వరుణుడునిన్ను రాజుగా సంబోధించునుగాక. వరుణుడు నిన్నుఆహ్వానించుచున్నాడు.నీవు రాజ్యమునఅడుగు పెట్టుము.

6.పరమైశ్వర్య ఇంద్రా! వరుణునిసహితముగాఈ రాజు రాజ్య ప్రవేశమునకునీవు అనుమతించిఉన్నావు. కావున నీవుప్రజలముందునకురమ్ము. ఇంద్ర వరుణులఅనుమతి పొందినరాజు రాజ్య ప్రవేశముచేయును గాక. ప్రవేశించిదేవతలనుయజించును గాక.అతడు ప్రజలనువారివారి పనులందునియంచును గాక.

7.రాజా! సమృద్ధములగుమార్గములందుహితము కూర్చుదేవతలనుజలదేవతలుశుభములు కలిగింతురుగాక. రదరు ఏకమనస్కులైనిన్ను రాజ్యమునకుఆహ్వానింతురు గాక. అప్పుడునీవు ప్రచండ బలవంతుడవైవార్ధక్యము వరకురాజ్యమును పాలింతువుగాక.

## ఐదవసూక్తము - 5

ినియోగము: ధన, బల,తేజోపుష్టికి మోదుగుచెట్టు మణినిఈ సూక్తముచే వాసిత,సంపాతిత, అభిమంత్రణముచేసి కట్టవలెను.అంగీరసీ మహాశాంతియందును.

1.పలాశ మణిని ఆహ్వానించుచున్నాను.అది సంపదలు ఇచ్చునది.శత్రువును వధించునది.

ఈమణి ఇంద్రాదులబలము కలదు.ఓషధుల సారము కలది.ఇది నన్ను డువకుండునుగాక. నన్ను తేజస్వినిచేయును గాక.

2.పలాశమణీ! నా యందుబలమును ప్రవేశపెట్టుము.ధనము ప్రసాదించుము.నేను నా బలమునరాజ్యమును నా అధీనమునఉంచుకుందును గాక. నేనుఉత్తముడను అగుదునుగాక.

3.ఇది ప్రియమణి.దేవతలు దీనియందుఓషధుల రహస్యగుణములను చేర్చినారు.

దేవతలుఆ మణిని మమ్ముభరించనట్లును,అయుష్యము కలిగించునట్లునుమాకు ప్రసాదింతురుగాక.

4.ఉగ్రబలసంపన్నసోమ మణి మాకులభించునుగాక. ఈ మణి ుఱుట్లుగొలుపునది. ఇంద్రునిచేఇవ్వబడినది.వరుణునిచే అనుష్ఠించబడినది. దీనినినేను ' దీర్ఘాయుత్వాయశతశరదాయ ' ధరించుచున్నాను.

5.ఈ మణి మాకు అనంతశుభములు కలిగించుచుచిరకాలము మాతోఉండును గాక. మేముఆర్యమను, సమానబలవంతులనుంచుటకు ఈ మణినికట్టుకొనుచున్నాము.

6.మత్స్య కారులు, రథకారులు,కర్మకారులు మనీషులు ీరందరిని పలాశమణీ!నా చుట్టు చేరిసే ించు వారిని చేయుము.

7.అన్య రాజులు, రాజునుచేయువారు, సూతులు,గ్రామణ్యులు ీరందరినీపలాశమణీ! నా చుట్టుచేరి సే ించు వారినిచేయుము.

8.మణీ! నీవు అమృతమయసోమమవు. దేహరక్షకమవు. ీర్యమానవు.కావున నా సహజన్మవు.

"సంవత్సరస్య తేజసాతేనబధ్నా ుత్వా మణె " సూర్యునితేజస్సుగా నిన్నునేను కట్టుకొనుచున్నాను.

(మణిఅనగా తాయెత్తువంటిది.)

## రెండవఅనువాకము

## మొదటిసూక్తము - 6

 నియోగము:

1)అభిచార కర్మమునఖదిరమున పెరిగినఅశ్వత్థ మణినిసంపాతన, అభిమంత్రణచేసి కట్టవలెను.ఇంగిడాలంకృత పాచికలనుసంపాతిత, అభిమంత్రణములుచేసి 'శత్రు మర్మము'న పాతిపెట్ట వలెను.పాచికలను సంపాతిత,అభిమంత్రణచేసి 7వ మంత్రము,నదిలో వదలవలెను. అట్లే8 వ మంత్రముచేరా  కొమ్మకు కట్టవలెను.

2)అభిచరితునకు,అభిచర్య మానునకుమహాశాంతి మణిబంధనమున నియోగము.

1.అశ్వత్థము ీర్యవంతము. పురుష వృక్షము. ఖదిరము- చంద్ర - గాయత్రిసారము నుండి పుట్టినది.అత్యంత బలశాలి.

ఖదిరమునుండి పుట్టినఅశ్వత్థము నా శత్రువులను,నన్ను దేషించువారిని, నేను ద్వేషించువారిని హతమార్చునుగాక.

2.కంటకమై బాధించుఖదిరమున పుట్టినఅశ్వత్థమణీ! వృత్రహంతఇంద్రునితోను, వరుణునితోనూ నీకు మైత్రికలదు.నీవు శత్రువులనుసమూలముగ హతమార్చుము.

3.అశ్వత్థమణీ! నీవుఅంతరిక్షము వంటిఖదిరమును చీల్చుకొనిపుట్టినావు. అట్లేమేము ద్వేషించువారిని,మమ్ము ద్వేషించువారినిఅందరిని చీల్చుము.

4.ఆబోతు తోటి వారినిఎదిరించి గెలిచినట్లుఅశ్వత్థము వృక్షములనుజయించినది. అశ్వత్థమణినిధరించిన మేముమా శత్రువులనుసంహరింతుముగాక.

5.అశ్వత్థమా! మేముద్వేషించు, మమ్ముద్వేషించు శత్రువులనుపాప దేవతయగు'నిర్ఋతి' వదలనిమృత్యు పాశములచేబంధించునుగాక.

6.అశ్వత్థమా! నీవు చెట్టునందు పుట్టుదువోఆ చెట్టును కొంచెపుదానిని చేయుచున్నావు.అట్లే మా శత్రువులతలలను భేదించుము.వారిని లెక్క చేయకుము.నష్టపరచుము.

7.కట్టు ండిచినావ నదిలో కొట్టుకొనిపోయినట్లు మా శత్రువులుకొట్టుకొని పోవుదురుగాక. అశ్వత్థము చీల్చిపుట్టిన ఖదిరమునకుపునరుత్పత్తి లేనట్లేమా శత్రువులుమరల తలెత్తకుందురుగాక.

8.మా శత్రువులనుధ్వంసము చేయుటకుమనోస్థానమునఉచ్చాటన చేయుచున్నాను.మంత్రములచేశత్రుస్థానమునఉచ్చాటన చేయుచున్నాను.రాం చెట్టు కొమ్మంద నిలిచి శత్రువులనుధ్వంసము చేయుచున్నాను.

## రెండవసూక్తము- 7

ంనియోగము:-

1)క్షేత్రీయ, వంశానుక్రమవ్యాధుల శాంతికిఈ సూక్తముచే జింకకొమ్మమణిని కట్టవలెను.కొమ్మ ముంచినంటిని త్రాగవలెను.జింక చర్మము మచ్చభాగమును కాల్చి,నీటిలో కలిపి, ఆనీటిని ప్రాతః కాలమునరోగి ంద చల్లవలెను.యవల హోమముచేసి అభిమంత్రితఅన్నము తినవలెను.

2)రోగియగు బాలకునకుఈ సూక్తముచే కౌమారీమహాశాంతి చేయవలెను.

1.వడివడిగ పరుగులిడుజింక తలలో మొలిచినకొమ్ములు ఔషధముఅగుచున్నది. ఆ కొమ్ము వంశానుక్రమముగావచ్చు క్షయ, కుష్ఠు,అపస్మారములను అన్నికోణములు నుంచినష్టపరచును గాక.

2.వరము లివ్వ గలజింక కొమ్ము తననాలుగు కాళ్లచేవ్యాధులను మర్దించుచున్నది.అది ఈరోగి హృదయమునగూడు కట్టిన క్షేత్రీయవ్యాధులను నిర్మూలించునుగాక.

3.ఇది జింక చర్మము.ఇది నలువైపులవ్యాపించి ఉన్నది.రోగీ! దీనిచే నీలోనన్ను క్షేత్రీయవ్యాధులను సర్వాంగములందును" నాశయామసి ".

4.ఆకాశమున సౌభాగ్యవంతలగు'ంచృత' అను పేరుగలనక్షత్రములుఉన్నం. అం రోగి యొక్క దిగువ,పై భాగముల నుండిక్షేత్రీయ వ్యాధిపాశములను తొలగించునుగాక.

5.జలమే ఔషధము.జలమే వ్యాధినాశకము. జలమేసమస్త భేషజము.కావున ఆ జలమేక్షేత్రీయ వ్యాధినుండి ంముక్తి కలిగించునుగాక.

6.వ్యాధిగ్రస్తా! నీవువాడిన అన్నపానాదులవలన క్షేత్రీయవ్యాధులు కలిగినఁ.నాకు ఆ వ్యాధి నివారణఔషధములు తెలియును.వానిచే నీ వ్యాధులనునిర్మూలింతును.

7.నక్షత్రములుకనిపించని ఉషః కాలమునలేక తరువాతచేయు స్నానముమా నుండి సకల రోగములనుదూరము చేయునుగాక. క్షేత్రీయ వ్యాధులుమా నుండి సమూలముగదూరమగును గాక.

## మూడవసూక్తము - 8

ఁనియోగము:-

1)ఈ సూక్తముచే ఉపనయనమునబాలకుని నాభినితాకి అభిమంత్రించవలెను.

2)ఆయుష్య గణమునఈ సూక్త పాఠము కలదు.

3)4వ మంత్రముచేఁవాహము నందుశుల్కమును 'ఇదినాది'అని పంచవలెను.

4)5,6 ఋక్కులచేసాంమనస్య కర్మముననీటికుండను ఊరినడుమకు తేవలెను.మూడేళ్ల గోవుపిశితమును తినవలెను.సంపాతిత అన్నముభుజించవలెను.సంపాతిత సుర త్రాగవలెను.సంపాతిత జలముత్రాగవలెను.

1.ఁత్రదేవతతన కిరణములచేభూఁని ప్రకాశవంతముచేయుచు, ఋతువులను

కల్పించుచు,మాకు దీర్ఘాయువుకలిగించుచు 'ఆయాతు'- వచ్చును గాక. అట్లేవరుణుడు, వాయువుఅగ్ని మమ్ము గొప్ప రాజ్యమునుపాలించు యోగ్యునిచేయును గాక.

2.ధాత, ఆర్యను, సఁతనా హఁస్సులు స్వీకరింతురుగాక. ఇంద్రుడు, త్వష్టమా స్తుతులు ఆలకింతురుగాక. శూరులగు పుత్రులుగల అదితిని ఆహ్వానింతురుగాక. శూరులగు పుత్రులుగల అదితిని ఆహ్వానించుచున్నాను.వారందరు నన్ను నావారిలో శ్రేష్ఠుని చేయుదురుగాక.

3.సోముని, సఁతను, అదితియొక్క సమస్త పుత్రులకునమస్కరించి ఆహ్వానించుచున్నాను.నా వారిలో నేను సదాఉన్నతుడను అగుదునుగాక. ఆహుతులఆధార భూత అగ్నిప్రజ్వరిల్లునుగాక.

4.అమ్మలారా! ఈ కన్యవద్దనుండి కదలకండి.వదలి వెళ్లకండి.సర్వరక్షక పూష ఁకు ప్రేరణ కలిగించునుగాక. వరుని కోరిన వధువువెంట ఁశ్వేదేవతలుఉందురు గాక.

5.పరస్పర ఁరుద్ధ భావములవారిని ఁరుద్ధ రహితులను,ప్రసన్నులను చేయుచున్నాను.ఁ మాటలు, చేతలు,సంకల్పములనుఁరోధ భావ రహితులను,అనుకూలురను

చేయుచున్నాను.ఇది వరకు ిరు చేసినపరస్పర ిరుద్ధ కర్మములనుఅనుకూలము చేయుచున్నాను.

6.ి ప్రతికూల మనసులనునా మనసుచే అనుకూలముచేయుచున్నాను.ిరు సహితమునా చిత్తముతోఅనుకూలురై వెంటసాగండి. నా పనులందుి మనసులు లగ్నముచేయండి.

## నాలుగవసూక్తము - 9

ినియోగము:-

ిఘ్ననివారణ కర్మమున.'అరలు' మణిని కట్టవలెను.సర్పము, కొమ్ములున్న,కోరలున్న జంతువులబాధ నివారణకుసంపాతిత వెదురుదండము ధరించవలెను.యుద్ధమునశత్రువు రచించినమాయ మున్నగుిఘ్న నివారణకు సంపాతితఆయుధము ధరించవలెను.అన్ని పనులు ప్రారంభించునపుడుిఘ్నశాంతికి 'ఫలీకరణ'ధూపము వేయవలెను.

1.గిట్టలున్న, గిట్టలులేని జంతువులకుద్యావాపృథ్వులు తలిదండ్రులుఅగుచున్నారు. దేవతలారా!వానిని మా ిదకు తోలినట్లేవానిని వెనుకకు రప్పించుకొనండి.

వ్యాఖ్య- సింహశార్దూలాదులతలిదండ్రులుద్యావాపృథ్వులు అయినందునవానిని నివారించుటమానవులకు సాధ్యపడునదికాదు. కావున దేవతలేనివారింప వలసి ఉన్నది.

2.ిఘ్న నివారణకు దేవతలు'అరలు' మణిని ధరించినారు.మనువు కూడ ధరించినాడు.నేను ఆ మణినిధరించి ఎద్దుకువట్ట కొట్టినట్లుిఘ్నములను నిర్వీర్యముచేయుచున్నాను.

3.అన్యులు కల్పించినిఘ్నములు నివారించుటకుసాధకులు పింగళవర్ణ సూత్రమునకట్టిన అరలుమణిని ధరింతురు.మేము ధరించిన"అరలు మణి" శ్రవస్యాన్నము,శోషకము, కుర్వర వర్ణ క్రూరజంతువుల బాధనునివారించును గాక.

4.శత్రువును జయించిఅన్నము సాధించదలచినిరులారా! ిరు యుద్ధమునఅసుర మాయామోగుతులైఉన్నారు. ఇతరులు చేసిన- దేవతలు చేసినటువంటి - మాయలోపడి ఉన్నారు. కోతలుకుక్కలను తరిినట్లుఈ ఆయుధము ఆ మాయలనుతరుమును గాక.

5.మణీ! అన్యులుకల్పించిన ిఘ్ననివారణకు నిన్ను ధరించుచున్నాను.'కాబవ' నివారణకు నిన్నుధరించుచున్నాను.వేగవంత అశ్వములరథము ఆటంకములులెక్కచేయకసాగినట్లు ిఘ్నములనులెక్కింక మా కార్యములుసాధింతుము గాక.

(నూటఒక్కిఘ్నములలో 'కాబవ'ఒకటి.)

6.భూిు ిద అనేక ిధములనూటఒక్క ిఘ్నములున్ని.వానిని నివారించుటకేదేవతలు ఈ మణినిసృష్టించినారు. కావునిఘ్ననివారక 'అరలు' మణినినేను ధరించుచున్నాను.

# మొదటిసూక్తము - 10

ానియోగము:
పుష్టికొరకు. అష్టకా కర్మమున- మాఘకృష్ణ అష్టమి అష్టకయగును.

1)ఘృతము, మాంసము,స్థాలీపాకము ఈ మూడింటిలోఒక్కొక్క దానితో మూడుమూడు మారులు ఆహుతిఇవ్వవలెను. తొమ్మిదిసార్లు సూక్తము చదువవలెను.

యవలపేలాలు, పెరుగు కలిపినసత్తు, పూరీ, పురోడాశము,క్షీరాన్నము తైలాన్నములను'అధిశ్రయణ' పర్యాగ్నికరణముతో సంస్కరించినేతితో కలిపి ఇరువదిముద్దలు చేయవలెను.పశువు యొక్క కుడిభుజమును,వెంట్రుకలు లేనిసచర్మ ఖురమునుకడిగి ఈ సూక్తముచేదర్వి ద్వారా ప్రత్యేకమంత్రముచేహోమము చేసిచివరన దర్విసహితఇరువది ఒక్క ఆహుతినిహోమించవలెను.దాని విధానం బెట్టిదనిన:-

1-5,8, 9, 11 - 12 మంత్రములచేతొమ్మిది పిండములనుఆహుతి చేయవలెను.

10వ మంత్రముచేయజించి స్వాహాచేయవలెను.

అనుషంగసహితముగఎనిమిది తీరుల విభజించినమంత్రముచేఎనిమిది పిండములను

హోమించవలెను.13 వ మంత్రముచేపద్ధెనిమిదవఆహుతి ఇవ్వవలెను.

'ఆహోరాత్రిభ్యాంత్వాయజే స్వాహా' అను కౌశిక సూత్రమందలి14 - 2 సౌత్రామంత్రముచేపందొమ్మిదవ ఆహుతిఇవ్వవలెను.

6,7మంత్రములచేపశువు కుడి భుజమునుఇరువదవ ఆహుతిఇవ్వవలెను. అదిలభించనపుడుఘృతాహుతి ఇవ్వవలెను.

7వ మంత్రముచేసదర్వియగు ఇరువదిఒకటన ఆహుతిఇవ్వవలెను.

యవలపేలాలు మున్నగుశేషమును ఈ పూర్ణ సూక్తముచేమూడు ఆహుతులుఇవ్వవలెను.

2)అష్టకా కర్మమున చేసినహోమములుకాక, మరల అట్లేఆహుతులుఇవ్వ వలెను.

3)సోమయాగమందుసోమక్రయణీయపదహోమానుమంత్రణమున6 వ ఋక్కు వినియోగము.

4)చాతుర్మాస్య హోమపుసాకమేధపు పూర్ణ దర్వీహోమమున7వ మంత్రపు ఉచ్చారణ.

5)రాత్రి రాజుకు హారతిఇచ్చునపుడు రెండవఋక్కు, పిండి బొమ్మనుఏర్పరచుటకు 3 మూడవమంత్రము ఉపయోగము.

6)ఉప స్థానమున ఏడవమంత్ర ప్రయోగము.

1.తొలుత రాత్రింబవళ్లులేకుండెను. ఉషస్సులేవాటిని ఏర్పరచినం.అం పితరులకు ఏకాష్టక ధేనువులుఅయినం. అం మాకు యశస్వినులు,ముందు ఉత్తమఫలితములు ఇచ్చునంఅగును గాక.

2.ఇది ఏకాష్టక ధేనురూపరాత్రి. ఇది దరి చేరుగాహం ఆరగించు దేవతలుప్రశంసింతురు. ఆ ఏకాష్టక సంవత్సరమునకుభార్య అగుచున్నది.ఆమె మమ్ము అనుగ్రహించునుగాక. శుభములుకలిగించును గాక.

3.రాత్రీ! నీవు సంవత్సరమునకుప్రతిరూపమవు. నిన్నుమేము ఉపాసించుచున్నాము.ఆమె మమ్ము ఆయుష్మంతులనుప్రతిరూపమవు. ధనవంతులనుచేయును గాక.

4.ఈమె యే ఉష. తొలుతరాత్రింబవళ్లనుఏర్పరచినది. అంధకారముదూరము చేసినది. ఈఉష ఇతర ఉషస్సులందుచేరి సంచరించును.ఈ ఉష మహా మహామహిమలుగలది. సూర్య, సోమ,అగ్ని మున్నగు దేవతలుఈమె యందే ఉంటున్నారు.

5. ఏకాష్టకా!వృక్షరూపములగు రోలు,రోకలి నీకు సంవత్సరమువరకు కావలసినవానిని దంచి, నూరినీ కొరకు సుశబ్దములుకలిగించుచున్నం.మేము మంచి సేవకులు,ంర పుత్రులు గలవారలమైధనస్వాములముఅగుదుము గాక.

6. ఇళాదేంఘృతపాదము జారుచున్నది.జాతవేద అగ్నీ!నీవు హంస్సులు,స్వీకరించుము. గ్రామ్యపశువులు అనేకములున్నం.వానిలో గోవు, మేక, గొర్రె,గాడిద, ఒంటె ఈ ఏడింటియందునాకు ప్రీతి కలిగించుము.

7. రాత్రీ!నాకు ధన, పుత్రపౌత్ర సమృద్ధికలిగించుము. మేముదేవతలు మంచిమనసులందు నిలిచెదముగాక.

సాధనమవగుదర్వీ! హం నింపుకొనిమేము పూజించుదేవతల వద్దకుచేరుము. మా అభిమతఫలములు నింపుకొనిమా వద్దకు తిరిగిరమ్ము.సమస్త దేవతలనుహంచే సంతుష్టులనుచేయుము. వారినుండిమాకు అన్నము, బలముతెమ్ము.

8. ఏకాష్టకా!నీ భర్త యగు సంవత్సరమువచ్చినాడు. నీవుఅతనితో సుఖించుము.మా పుత్ర పౌత్రాదులనుఆయుష్మంతులనుచేయుము. మాకుధనపుష్టి కలిగించుము.

9. ఋతువులనుయజించుచున్నాను.ఋతుపతిని యజించుచున్నాను.ఋతువుల అవయవములనుయజించుచున్నాను.సంవత్సరములను,మాసములను భూతములపతిని యజించుచున్నాను.

10.ఋతువుల ప్రసన్నతకురాత్రింబవళ్లుప్రసన్నతకు మాసములసంవత్సరములప్రసన్నతకు, ధాతంధాత సమృద్ధిదేవతల ప్రసన్నతకు,భూతస్యపతికొరకు ఏకాష్టకమును యజించుచున్నారు.

11.మాంసము, ఉపస్తరణము,అభిఘార ఘృత యుక్తహోమము చేయుచుదేవతలనుయజించుచున్నాము.వారి అనుగ్రహమునసకల కోరికలు తీర్చగల,అనేక గోవులు నిండినగృహమున సుఖముగవసింతుము గాక.

12.ఏకాష్టక అందరి స్వాం. ఆమె తపస్సుచేసి మహిమాన్వితుడగుఇంద్రుని కన్నది.ఇంద్రుని ద్వారా దేవతలుశత్రువులగు అసురులనుఅణచి వేసినారు. శచీపతినాశకారులకు ఘాతకుడుఅగును గాక.

13.ఇంద్ర పుత్ర, సోమపుత్ర,ఏకాష్టకా! నీవు ప్రజాపతిదుహితవు.మా హస్సులు స్వీకరించుము.మా కోరికలు తీర్చుము.

## మూడవఅనువాకము

## మొదటిసూక్తము - 11

నియోగము:

1)బాలగ్రహరోగము,నిరంతర స్త్రీసంగమమువలన కలిగినయక్ష్మకు చింతపండు,చేపల అన్నమునుఈ సూక్తముచే అభిమంత్రించిభోజన సమయమునతినిపించవలెను.అడ నువ్వుల కట్టెతోకాచిన నీటితోఉషః కాలమున అడలోగాని ఇంటిలో గాని రోగికిస్నాన మార్జన, ఆచమనములుచేయించవలెను.అడ జనుము, అడపిడకలు, 'చిత్య'మున్నగు శాంతా ఔషధములతోకాచిన నీటితోరోగికి ప్రాతః కాలమునస్నాన, మార్జన ఆచమనములుచేయించవలెను.

2)సకల రోగ నివారణకు రోగినితాకి ఈ సూక్తముచే అభిమంత్రణచేయవలెను.

3)అహోలింగ గణమునఈ సూక్తపాఠము ఉన్నది.

4)యజ్ఞమున జబ్బుపడినయజమాని చికిత్సకొరకు ఈ సూక్తమును చదువవలెను.

1.ఈ అన్నముచే అజ్ఞాతముగనీ దేహమునప్రవేశించిన యక్ష్మనుతొలగించుచున్నాను.నీవు చిరకాలముజీంచుటకు గానునిన్ను రాజ యక్ష్మమునుండి ముక్తుని చేయుచున్నాను.

ఇంద్రాగ్నులారా!పిశాచము ఈ బాలునిపట్టి పీడించుచున్నచోఇతనికి పిశాచ, గ్రహముక్తి కలిగించండి.

2.ఇతడు క్షీణాయువుఅయినను, ఈ లోకమునుండి ప్రస్థానముచేయు వాడయినను,మృత్యువునుచేరుకున్న వాడైనను,ఈ లోకమునకు ఈడ్చితెచ్చెదను.నూరు శరత్తుల కాలముజీ ంప చేయుదును.

3.ఈ అన్నము చేతఇతనిని వేల చూపులుగల వానిని, వందల ర్యములు గల వానిని,శతాయుష్కుని చేయుచున్నాను.ఇంద్రుడు ఇతని ఆయుక్షీణమునకుకారణములగు పాపములనుతొలగించి నూరు షరత్తులుజీ ంప చేయునుగాక.

4.శతం జీవ శరదో వర్ధమానఃశతం హేమన్తాన్ఛతమువసన్తాన్ ।

శతంత ఇన్ద్రో అగ్నిః స తాబృహస్పతిఃశతాయుషా హ షా హార్షమేనామ్॥

5. డిచిన, డువనున్నప్రాణాపానములు- ఎడ్లబండి తనగమ్యముచేరినట్లు - శరీరమునప్రవేశించును గాక. ద్వాంసులుమృత్యుకారకములగుఏ వందల వ్యాధులనుచెప్పుచున్నారో

వాటినుండియు అన్యమృత్యు కారక వ్యాధులనుండియు ముక్తికలుగును గాక.

6.ప్రాణాపానములారా!ఈ దేహముననేనిలువండి. తొందరపడి డిచిపోకండి. ఇతనిదేహమును,కాళ్లు చేతులుమున్నగు అవయవములనువార్ధక్యము వరకు ధరించిఉండండి.

7.వ్యాధిగ్రస్తా! నిన్నువార్ధక్యము వరకు జీ ంపచేయుచున్నాను.వార్ధక్యము వరకు రోగములనుండి రక్షించుచున్నాను.వార్ధక్యము నీకు శుభములుకలిగించును గాక. ద్వాంసులుమృత్యు కారకములగుఏ వందల వ్యాధులుచెప్పుచున్నారో అ నీకు దూరముగ ఉండునుగాక.

8.వ్యాధిముక్తా! ఆబోతునుపగ్గముతో కట్టినట్లువార్ధక్యము నిన్నుకట్టిపెట్టునుగాక. పుట్టుకతోనే మృత్యువునిన్ను అకాల పాశమునబంధించినది.బృహస్పతినిన్ను అకాల మృత్యుపాశము నుండి డిపించునుగాక.

## రెండవసూక్తము - 12

 నియోగము:-

1)వాస్తోష్పత్య గణమునకొత్త ఇల్లు కట్టునేలను నాగలితోదున్నవలెను.

2)శాంత్యుదకాది చతుర్గణీశాంతి ప్రయోగ మైనపుడెల్లదీని నియోగము.

3)కొత్త ఇంటి కొరకు పాతునట్టిస్తంభములనుఈ సూక్తముచే అభిమంత్రించవలెను.

1,2మంత్రములచేభూ౦ని గట్టిపరచవలెను.6వ మంత్రముచేనేతిలో ముంచిన

వెదురుబొ౦గులను స్తంభములపైదకు ఎక్కించవలెను.

4)గృహ ప్రవేశముచేయునపుడు8వ మంత్రముచేపూర్ణకుంభముతోస్త్రీ అడుగు పెట్టవలెను.

1.ఇచటనే స్తంభముపాతుచున్నాను. స్థిరపరచుచున్నాను.ఈ గృహము కోరికలుతీర్చునది అగ్నిభయ రహితము,క్షేమంకరము అగును గాక.

గృహమా!నీ యందు గుణవంతులు,రోగ రహితులు,అరిష్ట రహితులగుపుత్రులతో కూడినివసింతుము గాక.

2.గృహమా! నీవుఇచటనే అశ్వవతి౦,గోవతి౦, మధురవాక్యవతిమగుచు స్థిరపడుము.

బలవతి౦,పయస్వతి౦, ఘృతవతి౦అయి మాకు మహాభాగ్యముకలిగించుము.

3.గృహమా! నీ యందుభోగభాగ్యములున్న౦.మహాఛందోదేవతలున్నారు.అక్షయ ధన ధాన్యములున్న౦.నీలోనికి దూడలు,శిశువులు ప్రవేశించునుగాక. సాయంకాలమైనంతపాలు చెపునట్టిగోవులు నిన్ను చేరునుగాక.

4.గృహ నిర్మాణమునుఎరిగిన స౦త, వాయువు,బృహస్పతిఈ ఇంటిని చక్కగా నిలుపుదురుగాక. మరుత్తులు ఈనేలను పాలతోను,నీళ్లతోను తడుపుదురుగాక. భగదేవతఈ నేలను దున్నునుగాక.

5.గృహమా! నీవుదే౦౦. వాస్తు పత్ని౦.ధాన్య పోషకవు. తొలుతనిన్ను దేవతలునిర్మించినారు. నీవుగడ్డిని కప్పుకున్న దానవు.మంచి మనసున్నదానవు. నీలో నివసించుమాకు పుత్రసహితధనము కలిగించుము.

6.వంశమా! - వెదురుగడా!నీవు ఇంటి నడి౦గుంజ పైద కదలకనిలిచి ఉండుము.

గృహమా!నీలో ఉండువారు ఆర్తులుకారాదు. నీలో వసించుమేము పుత్ర పౌత్రులతోసంపన్నులమై శతశరత్తులు జీ౦౦తుముగాక.

7.ఈ ఇంటికి పసి పిల్లలు,ప్రాయపు బిడ్డలువచ్చెదరు గాక.గోవుల సహితముగాదూడలు

వచ్చునుగాక. పొంగి పొరలు తేనెకుండలు,పాల బిందెలు,పెరుగు కడవలు చేరునుగాక.

8.అమ్మా! ఈ కుండ అమృతమయజలము, తొణికిసలాడుతేనె, నేతులతోనిండి ఉన్నది. దీనినిఇంటిలోనికి చేర్చుము.మనము ప్రవేశించుచున్నఈ ఇంటిని ఆ కలశములోనిఅమృత

జలమునవెలుగొందించుము.మేము చేయుశ్రౌత, స్మార్త కర్మలుదీనిని చోరులు, అగ్నినుండి రక్షించునుగాక.

9.ఈ కలశమందలి నీరుస్వయముగా యక్ష్మనాశని.నీ సేవకుల యక్ష్మనునివారించునది. ఈ పూర్ణకుంభమును అక్షయఅగ్ని సహితముగగృహమున చేర్చుచున్నాను.

వ్యాఖ్య- ఈ వాస్తు సూక్తము మనసునుచెమర్చుచున్నది.కంటిని నింపుచున్నది.హృదయమునఅమృత కలశమునుతొణికించుచున్నది.

ఇటుకతోకట్టిన దల్లఇల్లుకాదు. మనసులుకలసినది, మనసులుపరచినది ఇల్లగుచున్నది.ఇల్లు పూరిదా, పెంకులదా,సిమెంటుదా కాదు చూడవలసినది. ఆ ఇంటమనసున్న మనుషులున్నారా?మనసుల కిలకిలలుఉన్నవా? మనసులు◌ికసించి పరిమళించుచున్నవా?అ◌ి అన్ని ఉన్న అది ఇల్లు,లేకున్న కొంప.

ఇంటికిఉండవలసిన లక్షణములనుతొ◌ిమ్మది ఋక్కులలో◌ివరించినాడు. భౌతికస్వరూపములు కాలానుగుణముగమారవచ్చు. ఆంతరికముగామంచి ఇల్లు ఏనాటికీఇంతకు

◌ించదు.ఇది ఆదర్శము - నాటికి,నేటికి, రేపటికి!

మానవునిసుఖ జీవనమునుగురించి ఎంత అధ్యయనముచేసినారు !!!

## మూడవసూక్తము - 13

◌ినియోగము:

1)నదిని కోరిన చోటికిప్రవహింపచేయుట.

నదినితీసుకొని పోవలసినమార్గమును త్ర◌ివ్విఈ సూక్తముచే నీరు చల్లవలెను.కాశ, శైవల, పటేరక,వేతసములలోఒక కొమ్మను తెచ్చిఈ సూక్తముచే అభిమంత్రించి గోతిలోపాతవలెను.ఏడవ మంత్రపుమొదటి " ఇదంవా ఆపః " పాదము చది◌ిబంగారము పారవలెను." ఇయం వత్సః " అనురెండవ పాదముచేకప్పను నలుపు, ఎరుపుదారములతో కట్టిగుంతలో అభిమంత్రించిఉంచవలెను.' ఇహేత్థమ్' అను మూడవ పాదముచేఅభిమంత్రితజలము చల్లవలెను' యత్రేదమ్' అను నాలుగవ పాదముచేకప్ప◌ిద నీరు పారించవలెను.

2)గ్రామాదులకు కొత్తనీటివరద వచ్చినప్పుడునదిని ప్రవహింపచేయుటకునుధాన్యచరు, ఆవుపాలు,ఘృతమును వేతసస్రువముచే వరుణునకుమూడు ఆహుతులుఇవ్వవలెను. వేతసచమసమున వేతసఉపమంథినులతోదధిసత్తునుమధించి బలిహరణముచేయవలెను.

3)దూరము పోయిన నదినిమరలించుటకుఈ సూక్తమును జపించుచునదీప్రవేశ

మార్గమునశయనించవలెను.

4)దీనితోనే మరుత్తులకుహోమము చేయవచ్చును.కాశ, ది ధుక, వేతస

ఓషధులనుఒక పాత్రలో సంపాతితఅభిమంత్రణముచేసి నీటిలోముంచి వదలవలెను.

5)వర్షము కోరువారు కుక్కతలలేక మేక తలనుఅభిమంత్రిక జలమునఉంచవలెను.

మనిషితలవెంట్రుకలు,పాత చెప్పులనుగడకు కట్టి, పచ్చికుండను మంత్రజలముతోప్రోక్షించి, ఉట్టికికట్టి నీటి ముధ్యనపెట్టవలెను.

6)అర్ధోత్థాపన ఘ్నశమనకర్మయందు ఈ సూక్తముచేఘృతాహుతులుఇచ్చునది. సంపాతితఅభిమంత్రితజలముచేస్నానము, అభిషేకముచేయునది.

1.జలమా! అభేద్యమగుమేఘమును భేదించినంతనీవు ఇటునటుఉరికి నదించినావు- శబ్దము చేసినావు.అందువలననేనీ పేరు 'నది' అయినది.జరుగు స్వభావముగల జలమా! 'అప్'ఉదకము అనునదిసహితము సార్థకముగనేఏర్పడినది.

2.వరుణరాజు ప్రేరణచేనీవు నాట్యముచేయుచు ఒకచోటచేరినావు. అప్పుడుఇంద్రుడు

నిన్ను'ఆపోన్త్' అందుకున్నాడు.అందువలన నీవు'అప్' అనబడుచున్నావు.

3.జలములారా! కుఇష్టము లేకున్నను కదిలిపోవు వారు. అట్టిమ్ము ఇంద్రుడు వరించిస్వాధీన పరచుకున్నాడు.అందువలన దేవేరులగుకు 'వారి' అను పేరు కలిగినది.

4.ఉదకములారా! రు ప్రవహించుస్వభావము గలవారులుకదా! రుడగు ఇంద్రుడు

మ్మునిలిపి ఉంచినాడు. ఇంద్రునిచేబహూకృతలగురు మహత్తుగలవారలయినారు.

"తుస్మాదుదక ముచ్యతే" అందువలన 'ఉదకము'అన బడినారు.

5.జలము సుఖకరము,శుభప్రదము.జలము ఘృతమగుచున్నది.ఘృతము అగ్నికి ఆహుతిఅగుచున్నది. మరలజలమగుచున్నది.జలము అగ్ని సోములనుధరించుచున్నది.జలము మధురము.తీవ్రరసము గలది.ఆ జలము అక్షయమై,ప్రాణమై, బలమైనా దేహమున

ప్రవేశించునుగాక.

వ్యాఖ్య- జలము వలననేతృణాదులు కలుగుచున్న.అ తిన్న గోవులుఘృతమును కలిగించుచున్న.ఘృతము అగ్ని యందుచేరి జలముఅగుచున్నది. ఇదిఒక ఆవర్తము. జలమేఘృతము - ఘృతమేజలము అగుచున్నది.

"అగ్నౌ ప్రస్తాహుతిఃసమ్యగ్ ఆదిత్యంఉపతిష్ఠతే ।

